సరస్వతీ గ్రంథమాల, 47 వ పుష్పము.

సంపాదకుడు: కే. యస్. యన్. మూర్తి.

అధ్యక్షుడు, జవ్వాది లక్ష్మయ్య.



# సామ్రాజ్యతత్వము.



గ్రంథకర్త:

కళా వెంకట్రావుగారు, M. L. A.



వెల 0—8—0

# కృతజ్ఞత.

మా గ్రంథమాలాపక్షమున నీ ప్రచురమును బ్రకటింప దయతో మాకనుమతినొసంగిన శ్రీ కళా వెంకట్రావు ఎమ్. ఎల్. ఏ. గారికి మేమెంతయుఁ గృతజ్ఞులము.

ఈ చిన్ని వ్యాసమున—అనాగరిక ప్రదేశములందలి యాదిమ నివాసుల నశింపఁజేసియు, నాగరికతా దేశములందు వేఱుమార్గముల నవలంబించియు, ప్రపంచమున వివిధఖండములందు పాశ్చాత్యు లెట్లు సామ్రాజ్యసంపాదనలఁ జేసినదియు; అంతఃకలహముల బెంచి, ద్వేషానలము రగుల్కొల్పి, బిరుదుల భ్రమలగల్పించి ప్రతిపక్షుల వశపఱచుకొని, తమ శిక్షలచేఁ దత్తద్దేశబాలుర భావదాస్యపరులనుగాఁ జేసి తమ సామ్రాజ్య మెట్లు సుస్థిర మొనర్చుకొన్నదియుఁ దెల్పుచు, స్వేచ్ఛావిరహితములై యైరోపియనుల స్వలాభమునకై పడియున్న దేశముల స్వరాజ్యసంపాదనకు రక్తపాతరహితమైన మహాత్ముని యసహాయోద్యమమే రాచబాటయని వ్యాసకర్తగారు నిరూపించిరి.

కే. ఎస్. ఎన్. మూర్తి,
సంపాదకుడు,
సరస్వతీగ్రంథమాల.

కాకరపఱ్ఱు,
20—12—38.

# సరస్వతీ గ్రంథమాల.

కాకరపర్రు—పశ్చిమ గోదావరిజిల్లా.

స్థాపితము 1923.

—:O:—

ఈ గ్రంథమాలయందు మూడు మాసముల కొక గ్రంథము చొప్పున నవలలు, నాటకములు (సాంఘిక, చారిత్రాత్మక) ప్రచురింప బడుచుండును.

| | |
|---|---|
| సంవత్సర చందా రు. | 2—8—0 |
| ప్రవేశ రుసుము | 0—8—0 |

| | శాశ్వత చందా. | సంవత్సర చందా. |
|---|---|---|
| మహారాజపోషకులు | 500—0—0 | 50—0—0 |
| రాజపోషకులు | 250—0—0 | 25—0—0 |
| పోషకులు | 125—0—0 | 12—8—0 |
| సహాయులు | 50—0—0 | 5—0—0 |

ఇదివరలో గ్రంథమాలలో బ్రచురింపబడి అమ్మకమునకు సిద్ధముగ నున్న గ్రంథములు. అన్నియు ఒకేసారి కొనువారికి రు 12/-ల కొసంగబడును.

| | | |
|---|---|---|
| 1 | కనకాంగి Approved | 0—8—0 |
| 2 | విజయశ్యామ Approved | 0—12—0 |
| 3 | ప్రేమమహిమ Approved | 1—0—0 |
| 4 | బిలమందిరము Approved | 1—8—0 |
| 5 | మహారాష్ట్రజీవనప్రభాతము 2 భాగములు Approved | 1—8—0 |
| 6 | దుర్గావతి | 0—12—0 |
| 7 | హత్యా నిరూపణము | 0—12—0 |
| 8 | కష్టసుఖములు 2 భాగములు Approved | 1—8—0 |
| 9 | నీలిపూలు | 0—12—0 |
| 10 | పతితనళిని 2 భాగములు Approved | 1—8—0 |
| 11 | అకాలీల సత్యాగ్రహము | 0—12—0 |
| 12 | ప్రేమచందుకథలు Approved | 0—12—0 |
| 13 | నీతిముక్తావళి Approved | 0—2—0 |
| 14 | కలము | 0—2—0 |
| 15 | నా ఎలక్షను అనుభవము | 0—12—0 |
| 16 | రాజ్యపాలనాశాస్త్రము | 0—12—0 |
| 17 | మరణభ్రమ | 0—12—0 |
| 18 | చిత్తోడుపతనము | 0—12—0 |
| 19 | కమలావిలాసము | 0—12—0 |
| 20 | తమోభవనము 2 భాగములు | 1—8—0 |
| 21 | సంయుక్త | 0—12—0 |
| 22 | చిట్టెమ్మ | 0—12—0 |
| 23 | రాధానంతము | 0—12—[illegible] |
| 24 | వెంకటకృష్ణరాయ జీవితము | 0—12—[illegible] |
| 25 | ప్రేమఫలితము | 0—12—[illegible] |
| 26 | సామ్రాజ్యతత్వము | 0—8—[illegible] |
| 27 | భరతశతకము | 0—2—[illegible] |

సంపాదకుడు—

కే. యస్. యన్. మూర్తి.

అధ్యక్షులు—

జవ్వాది లక్ష్మయ్యగారు.

# శాశ్వత మహారాజ పోషకులు.

1 మహారాజశ్రీ శ్రీ రాజా విజయ అప్పారావు సవాయి అశ్వరావు జమీందారు, వ. బాదుషాహి మన్ సబుదారుసర్కారు, ముస్తుఫాన్నగరు సంస్థాన్ పాలపంచ శ్రీభద్రాచలం అండ్ నిడదవోలు దొరవారు శనివారపుపేట

2 ,, చుండూరి నారాయణరావుగారు బ్యాంకర్సు,

3 శ్రీ శ్రీ శ్రీ సురభి వెంకటరత్నమాంబనిజాం నవాబ్ వంతుబహద్దరు మహారాణీవారు జటప్రోలు సంస్థానం, కొల్లాపురం.

4 ,, రాజా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారు వారు వుయ్యూరు యెస్టేటు. నూజివీడు.

5 ,, జవ్వాది లక్ష్మయ్యగారు ప్రెసిడెంటు యూనియన్‌బోర్డు-డిస్ట్రిక్టుబోర్డు మెంబరు, పెనుగొండ.

6 ,, శ్రీ మహారాజా విక్రమదేవవర్మ బహదరు మహారాజావారు, జయపూరు సంస్థానము.

---

# రాజపోషకులు.

1 శ్రీ శ్రీ శ్రీ వీర వెంకట సత్యనారాయణస్వామివారు, ధర్మకర్త. శ్రీరాజా యి. వి. ఆర్. యస్. ప్రకాశరాయబహద్దుర్ జమీందారువారు, ఉండూరు, అన్నవరం.

2 ,, పోతాప్రగడ సూర్యనారాయన్‌గారు, ప్రొప్రయిటరు శ్రీ సుజనరంజనీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరం.

3 శ్రీ శ్రీ శ్రీ శ్రీ రాజా చింతలపాటి సూర్యనారాయణరాజుగారు. ఏటికొప్పాక.

4 ,, ముత్తా సర్వారాయుడుగారు, బ్యాంకరు, కాకినాడ.

5 ,, అణివిళ్ళ చినవెంకటశాస్త్రిగారు, కాకరపర్రు.

6 ,, ద్వారంపూడి బసివిరెడ్డిగారు, మార్టేరు.

7 ,, మొసలికంటి రామారావుగారు, ల్యాండులార్డు కాకినాడ.

8 ,, తణుకు భాస్కరరావుగారు, యల్. యమ్. యస్. నేత్రవైద్యులు, ఐ స్పెషలిష్టు తణుకు.

9 ,, ఆకుండి రాజారావుగారు, ల్యాండులార్డు, పిఠాపురం.

10 శ్రీమాన్, ప్రతివాది భయంకరం జగన్నాథాచార్యులుగారు, ముష్టిగుంట్ల.

---

# పోషకులు.

1 శ్రీశ్రీశ్రీ రావుబహదురు మోతే గంగరాజు జమీందారువారు ఏలూరు.

2 ,, సి. సన్యాసిరాజుగారు, డాక్టరు, సామర్లకోట.

3 ,, లంక రామారావుగారు, యం. బి. (హోమియో) కాకినాడ

4 ,, కళా వెంకటారావుగారు, అమలాపురం

5 ,, రావుసాహేబు కలిచెట్టి అబ్బాయినాయుడుగారు, పూళ్ళ.

6 ,, తల్లాప్రగడ భాస్కరరావుగారు ల్యాండులార్డు కోనాల.

7 ,, టి. వి. రామారావుగారు, తణుకు.

8 ,, రేబాల పట్టాభిరామరెడ్డి సోదరులు, జమీందార్లు నెల్లూరు.

9 ,, నడింపల్లి నరసింహారావు పంతులుగారు, గుంటూరు.

10 ,, [illegible]పూడి కేశవరావుగారు, భీమవరం.

11 ,, గారపాటి కనకయ్యగారు నాయుడుగూడెం.

12 మ॥ రా॥ రా॥ శ్రీ టి. కృష్ణమ్మ గారు డిస్ట్రిక్టుమునసిఫ్ పాలపర్తి
13 ,, తేతలి చినరామిరెడ్డిగారు విలేజిమునసబు పెనుగొండ.
14 ,, జిడ్డు శివరాంగారు సబ్ అసిస్టెంటు సర్జన్ భద్రాచలం.

---

# సహాయులు.

1 శ్రీ శ్రీ శ్రీ మోతే కృష్ణారావుగారు జమీందారు, యేలూరు.
2 ,, కొండూరి నారాయణరావుగారు, మర్చంటు యేలూరు.
3 ,, పైడా శ్రీరామకృష్ణయ్యగారు జమీందారు కాకినాడ.
4 ,, పోలవరపు రామచంద్రరావుగారు యేలూరు.
5 ,, కాసాని అప్పారావుగారు నిడదవోలు.
6 ,, తాడంకి సంజీవరావుగారు జనరల్ మర్చంటు బెజవాడ.
7 ,, కొల్లూరు మహాదేముడుగారు కరణం, కొక్కిరపల్లి.
8 ,, వాజపేయాజుల రామసుబ్బారాయుడుగారు.
9 ,, భూపతిరాజు సూర్యనారాయణరాజుగారు ఖండవిల్లి.
10 ,, నిమిషకవి భవానీశంకరరావుగారు యక్సైజుసబ్ ఇన్స్పెక్టరు.
11 ,, మామిడి సూరన్నగారు ఇనుపపెట్టెలవర్తకులు ధవిళేశ్వరం.
12 ,, యం. రామకృష్ణయ్యగారు డాక్టరు నిడదవోలు.
13 ,, దమ్మలపాటి వెంకట్రావుగారు బాదంపూడి.
14 ,, టి. జి. బంగారుస్వామిసెట్టిగారు రాజమండ్రి.
15 ,, పరిమి సుబ్బారావుగారు ల్యాండులార్డు తణుకు.
16 ,, మెండు వీరన్నగారు ప్రెసిడెంటు డి॥ బోర్డు పినపళ్ళ.
17 ,, యం. దశరథరామరెడ్డిగారు బుచ్చిరెడ్డిపాలెం.
18 ,, బెజవాడ వెంకటకృష్ణారెడ్డిగారు బుచ్చిరెడ్డిపాలెం.

19 శ్రీ శ్రీ శ్రీ రాజా పెండ్యాల శ్రీరామచంద్ర వెంకటకృష్ణరంగారావు జమీందారువారు కొండగూడెం ఎస్టేటు దోమ్మేను.
20 ,, భారతం సూర్యనారాయణగారు ఖండవిల్లి.
21 ,, రంకిరెడ్డి సత్యనారాయణమూర్తిగారు ల్యాండులార్డు వేమగిరి
22 ,, ద్వారంపూడి వెంకటరెడ్డిగారు అనపర్తి.
23 ,, ఉడత్తు వెంకటరమణగారు రాజమండ్రి.
24 ,, తుమ్మలపల్లి వీరభద్రరావుగారు పిప్పర.
25 ,, మియ్యాపుర రామకృష్ణారావుగారు ప్రయివేటు శక్రటరీ జటప్రోలు సంస్థానము.
26 ,, నండూరి రామారావుగారు నేత్రశస్త్రవైద్యులు తణుకు.
27 ,, కోట్ల వెంకటసుబ్బయ్యగారు దివాన్ జటప్రోలు సంస్థానము కొల్లాపురం.
28 ,, నరసింహదేవర సూర్యనారాయణ సోదరులు కంట్రాక్టర్సు వేమగిరి.
29 ,, ఎ. నంజుండయ్యగారు సెక్రిటరీ డిస్ట్రిక్టుబోర్డు బళ్ళారి.
30 ,, తమ్మినీడి వెంకటనారాయణగారు ఆచంట.
31 ,, రేబాల పెద్దసుబ్బరామిరెడ్డిగారు మోపూరు.
32 ,, బెజవాడ చంద్రశేఖరరెడ్డిగారు బుచ్చిరెడ్డిపాలెం.
33 ,, తంగిరాల రామమూర్తి } టీచర్సు ఆదోని.
34 ,, భాగవతుల వెంకటశాస్త్రిగారు } టీచర్సు ఆదోని.
35 ,, గాదె విశ్వనాథంగారు మార్టేరు.
36 ,, కోనాల పేరెడ్డిగారు మార్టేరు.
37 ,, సత్తి కామిరెడ్డిగారు మార్టేరు.
38 ,, కర్రి చినవెంకటరెడ్డిగారు మార్టేరు.
39 ,, జంపన సుబ్బరాజుగారు ఖండవిల్లి.
40 ,, పెనుమెత్స శీతారామరాజుగారు అజ్జరం.

41 శ్రీ శ్రీ శ్రీ రావుసాహేబు గుత్తా వెంకయ్యచౌదరిగారు ఏలూరు.
42 ,, వక్కలంక నరసింహంపంతులుగారు ఏలూరు.
43 ,, తెన్నేటి విశ్వనాథంగారు విశాఖపట్నం.
44 ,, బొమ్మిసెట్టి లక్ష్మీనరసింహస్వామిగారు నెల్లూరు.
45 ,, మంత్రిప్రగడ నరసింహంపంతులుగారు మద్రాసు.
46 ,, బొమ్మినపల్లి నరసింగరావుగారు నూజివీడు
47 ,, కాకాని వెంకటసుంద్రరావుగారు గుంటూరు.
48 ,, టి. వి. సుబ్రహ్మణ్యంగారు నెల్లూరు.
49 ,, పదకండ్లగురురాజాచార్య విద్వాన్ ఆదోని
50 ,, యం. వెంకయ్యగారు ఆదోని.
51 ,, కే. వేణుగోపాలరావునాయుడుగారు తహశ్శీలుదారు ఆదోని.
52 ,, యం. వెంకటసుబ్బయ్యగారు పోలీసు ఇన్స్పెక్టరు ఆదోని.
53 ,, తోట ధనపతిరావుగారు డాక్టరు తాడేపల్లిగూడెం.
54 ,, చేగొండి రామజోగయ్యనాయుడుగారు దొడ్డిపట్ల.
55 ,, కోనా వెంకటకృష్ణారావుగారు మునసబు విప్పర్రు.
56 ,, హాస్నేక్ పీరాసాహేబుసాధుగారు అనంతపూర్.
57 ,, కోలా రామారావుగారు కంట్రాక్టరు వైజాగ్.
58 ,, చాగంటి సాంబశివరావుగారు వైజాగ్.
59 ,, తంగిరాల వెంకటసూర్యనారాయణగారు
ఎల్. యఫ్. అసిస్టెంటు ఇంజనీరు తాడేపల్లిగూడెం.
60 ,, జిల్లా సుబ్బారావుగారు వెల్కంహోటల్ రాజమండ్రి.
61 ,, పుల్లి సత్యనారాయణగారు జంబుపట్నం.
62 ,, యర్రా చంద్రరావుగారు పుప్పలూరు.
63 ,, కంచిరాజు వెంకటసుబ్బారాయుడుగారు కరణం,
పెరవలి.

64 శ్రీ శ్రీ శ్రీ పుల్లా కృష్ణమూర్తిగారు యలమంచిలి.

65 ,, చిట్టూరి ఇంద్రయ్యాగారు మునసబు తణుకు.

66 ,, గుడిమెట్ల సోమిరెడ్డిగారి దత్తతకుమాళ్లు రామిరెడ్డి గారు మల్లిపూడి.

67 ,, కొత్త వెంకటేశ్వర్లుగారు మర్చంటు మారంపల్లి.

68 శ్రీమత్ కిలాంబి శేషావతారంగారు వకీలు ఏలూరు.

69 శ్రీ శ్రీ శ్రీ నూతక్కి రామశేషయ్యచౌదరీగారు అసిస్టెంటుదివాను జయపూర్ సంస్థానము రాయగడ.

70 ,, చిట్టూరి యిందరియ్యాగారు వకీలు ఏలూరు.

71 ,, తాళూరి కృష్ణయ్యాగారు యలమంచిలి.

72 ,, గుత్తికొండ పురుషోత్తంగారు స్పెషల్ మేజస్ట్రీటు పాలకొల్లు.

73 ,, కె. సుబ్బారావుగారు మునిసిపల్ ఇంజనీరు గుంటూరు.

74 ,, ముత్తా మల్లేశ్వర సర్వారాయుడుగారు బ్యాంకరు కాకినాడ.

75 శ్రీమత్ కిలాంబి రంగాచార్యులుగారు మ్యునిసిపల్ కౌన్సిలర్ గుంటూరు.

## కృతి.

చిన్నతనమునుండియు నాజాతీయ భావములకు

చేయూత నొసగిన మామామగారగు

# శ్రీయుత దువ్వూరి వెంకటేశ్వర్లుగారికి

కృతజ్ఞతాసూచకముగ సమర్పించుచున్నాను.

కళా వెంకటరావు

# విజ్ఞాపనం

చిన్ననాటినుండియు చారిత్రయందున్న యభిమానమే నన్ను చిన్నపుస్తకమును వ్రాయుటకు బురికొల్పినది. పాఠశాలయందును కళాశాలయందును చదువుకొనునపుడు సామ్రాజ్యము విషయమై కొన్నియపోహాలుండెను. ఉపాధ్యాయుల బోధనాపద్ధతులును, పఠనీయగ్రంథములు నందుకుకారణమని చెప్పవచ్చును. కళాశాలను బహిష్కరించిన పిదప జాతీయాదర్శములలో నేర్చుకొనిన సంగతులను పరికింపగా నవియన్నియు బూటకములని తేలినవి. అందువలన ప్రపంచచరిత్రను సత్యరూపమున పఠింపసాగితిని. దానిఫలిత మీచిన్ని పుస్తకమని వ్రాయనొప్పును. ఇందు పెద్దలకు తెలియనిసంగతులు లేవు. కాని రయితు సహోదరులు పఠించినచో సామ్రాజ్యముల చరిత్రయు, పరిపాలనా తత్వమును గ్రహింపగలరు. ప్రపంచ చరిత్రలో హిందూదేశము, ఈజిప్టు, చైనా మొదలగునవి నిజసామ్రాజ్యవైభవమును గాంచినవి. దీనియందు వాటిచరిత్రలను వ్రాయలేదు. నేడు ప్రపంచమునావరించియున్న పాశ్చాత్యసామ్రాజ్యముల గురించియే వ్రాసితిని. దీనిని వ్రాయుటలో ఆంగ్లచరిత్రలు, 'స్వరాజ్య' సంపాదకులగు పణికరుగారి సామ్రాజ్యతత్వమను యాంగ్లగ్రంథమును తోడ్పడినవి.

అచ్చుకార్యములను త్వరలో ముగించిన మన్మిత్రులు కాకినాడముద్రణాలయాధికారులకును తమగ్రంథమాలలో ప్రచురించిన ఆంధ్రయువజన స్వరాజ్యసభ వారికిని వందనముల నర్పించుచున్నాను. ఇదియే నాప్రథమప్రయత్నము. ముద్రణాస్ఖాలిత్యములను యితర తప్పులను చదువరులు మన్నింప వేడుచున్నాను.

కళా వెంకటరావు.

శ్రీ

# సామ్రాజ్యతత్వము

## ఐరోపాలోని ప్రాచీన సామ్రాజ్యములు.

### మొదటి అధ్యాయము.

నేడు నాగరకతా ప్రపంచమంతయు సామ్రాజ్యములతో నిండియున్నది. ఈమహా సామ్రాజ్యములన్నియు ప్రస్తుతము ఐరోపాదేశముల యధీనములోనున్నవి. ఇట్టి రాజ్యములు ప్రథమముననుండియు సామ్రాజ్యముల నెట్లు సంపాదించినవో యెట్లుపరిపాలించినవో వివరించుట ప్రస్తుతోద్దేశ్యము. క్రీస్తునకుకొన్నిశతాబ్దములకు పూర్వమే గ్రీసుదేశస్థులు ఐరోపాఖండమున సామ్రాజ్యస్థాపనా ప్రయత్నములు జేసియుండిరి. కాని గ్రీకులు తమసామ్రాజ్య విస్తీర్ణవైభవమునకంటె నధ్యాత్మిక మానసికోన్నతులయందు ప్రపంచ విఖ్యాతిని గడించిరి. ఏథెన్సు నగరములయొక్క సామ్రాజ్య నిర్మాణ ప్రయత్నములు గృహాంతఃకలహములచే సఫలీకృతములు కాలేదు.

స్వరక్షణ కొరకును, పరిష్యనుల దాడుల నెదిరించుటకును సమాన పౌరసత్వపు హక్కులతో స్థాపించిన డీలాసుసంఘము నాడు పేరొందినది. ఏథెన్సు సామ్రాజ్యముగా పరిణమించెను. కాని కొన్ని సంవత్సరములకు పిమ్మట సమానహక్కులతో జేరిన యితర రాజ్యములు "ఏథెన్సు" సామ్రాజ్యాధికారమును సహింపనోపక తిరుగబడెను. అంతటితో ఏథెన్సు సామ్రాజ్య మంతరించినది.

క్రీ. పూ. నాలుగవశతాబ్దములో మేసిడోనియా రాజగు అలెగ్జాండరు తనసామ్రాజ్య విస్తీర్ణముకొరకు ప్రాచ్యదేశము లపై దండయాత్రలను జేసెను. ఈజిప్టుదేశమును, పరిష్యా మహా సామ్రాజ్యమును నాతని వశమయినవి. ఆతడంతటితో నాగక హిందూదేశ పశ్చిమోత్తర ప్రాంతముల నత్యంతకష్ట ముతో జయింపగలిగెను. కాని మగధసామ్రాజ్యముయొక్క ప్రతిభ కెదురాడనోపక యాదిగ్విజయయాత్రాపరుడు గృహాభిముఖుడై దారియందు కైవల్యము నొందెను. అలె గ్జాండరు మరణానంతర మాతని సామ్రాజ్యము పటాపంచ లాయెను. అలెగ్జాండరునకు పిమ్మట గ్రీసుదేశములో బయలు దేరిన "ఏజియన్ సంఘము" మొదలగునవి నిజసామ్రాజ్యవై భవము నందలేక రోమనుల శౌర్యవిజృంభణములో మరచి పోయెను.

గ్రీసు సామ్రాజ్యమునకుపిమ్మట ఐరోపాఖండములో

నతిగన్నది రోమనుసామ్రాజ్యము. రోము, ఇటలీదేశములోని యొక ప్రాచీననగరము. ప్రథమమున రోము ప్రజాస్వాతంత్ర్య రాజ్యము. ప్రజాప్రతినిధులే రాజ్యపాలకులు. కాని క్రమముగా ధనగర్వముచే ధనాఢ్యులే ప్రాతినిధ్యపదవుల నందసాగిరి. వీరికాలముననే రోమనుసామ్రాజ్యము విస్తృతినిగాంచెను. మెరియసు, పోంపె, సీజరుప్రభృతులు రణవిద్యా కౌశలముచే జర్మనీయుత్తరప్రాంతము దక్క మిగిలిన ఐరోపాఖండమునంతను, యాసియామైనరు ప్రదేశమును, యుత్తరాఫ్రికానుకూడ జయించిరి. ఇట్టి విస్తీర్ణము ప్రజలకనులకు మిరుమిట్లుగొలిపి సామ్రాజ్యవాసుల చేయగలిగెను. రోమనుల పరిపాలన సుఖకరముగా నుండలేదు. వారతికఠినముగా పన్నులను గట్టుటయే గాక వసూలుచేయుటలో క్రూరదండనా పద్ధతుల నుపయోగించియుండిరి. అందుచే పాలితులకు రోముపై భక్తినశించెను. రోమనులు తమభాషనే యితరప్రదేశములలో విద్యాగారప్రస్థాపియ నాగరికతకును వాఙ్మయప్రపంచమునకు నపారనష్టమును గలుగజేయుటయేగాక, నేటి యాంగ్లేయుల భారతదేశ పరిపాలనారీతిని తమ విద్యాప్రచారముచే దేశీయులను తమ మనోచాంచల్యమునకు దాసానుదాసులుగా జేసివైచిరి.

క్రీస్తునకు తరువాత నాలుగువందల డెబ్బదియారవ సంవత్సరమున యొకమోటు జర్మనుజాతి క్షీణదశలోనున్న రోమను సామ్రాజ్యమును జయించెను. రోముయొక్క సామ్రాజ్య

ము వేశ్వేరు యనాగరికజాతుల వశమాయెను. సామ్రాజ్య విధ్వంసమునకు పూర్వము రోమను సామ్రాజ్యములోని సగము పాలు కాన్స్టాంటునోపులు పట్టణమునుండి పాలించు నొక రోమను చక్రవర్తి యధీనములో నుండెను. నాడుముఖ్యపట్టణమగు రోము శత్రువుల వశమగుటచే నామమాత్రముచే యీ నూతన సామ్రాజ్యమే రోమనుసామ్రాజ్యమాయెను. కాని యింతకు పూర్వమే క్రైస్తవమతమునకు రోమునగరము మతాధిపతి పీఠమయ్యెను. ఇందువలన సామ్రాజ్యము నశించినను యేకమతస్థులగు వారందరకు రోమునగరము దృష్టిపథమునందే ప్రకాశింపసాగెను. సామ్రాజ్యము రూపులేకపోయినను సామ్రాజ్యశబ్దమునకు గౌరవముమాత్రము నశింపలేదు. నాటి ఐరోపాప్రజలు రోమనుసామ్రాజ్యము దైవదత్తమనియు యవినాశియనియు గట్టినమ్మకము గలిగియుండిరి. ఈభావలక్ష్య సాహాయముచే ఫ్రాంకుజాతులకు రాజైన చార్లమేను 800 వ సంవత్సరమున రోమునగరమున చక్రవర్తిగా పట్టాభిషేకము నొంది, నాడు రెండవసామ్రాజ్యమును పాలించుచున్న నొకనారీమణిని వివాహమాడి తనపదవిని స్థిరపరుచుకొనియెను. చార్లమేను సంతతివారు శక్తియున్నను లేకపోయినను యిటలీదేశమును పాలించుటకు పూనుకొనుటచే గతశతాబ్దము వరకు యిటలీకిగాని జర్మనీకిగాని ప్రత్యేకరాజ్యముగానుండుట తటస్థింపలేదు. క్రమముగా జాతీయసంస్థలు బయలుదేరి ప్రతి

రాజ్యము స్వాతంత్ర్యమును ప్రకటింపసాగెను. అనేక కష్టసుఖములకోర్చి యవినాశని యనిమన్నింపబడిన రోమనుసామ్రాజ్యము 1806 వ సంవత్సరములో యంతమొందెను. నెపోలియను విజృంభణమున కాగలేక నాడుచక్రవర్తిపదవిలోనున్న యాస్ట్రియారాజు సామ్రాజ్య శబ్దమును పదవిసహితముగా కాలాగ్నికాహుతిచేయక తప్పినదికాదు.

రోమను సామ్రాజ్యపు ప్రథమ దివసములనుండియు నేల మార్గముగుండా ప్రాచ్యదేశములతో వర్తకము చేయుచుండుటగలదు. ప్లయినీ చరిత్రకారుడు రోమనుసామ్రాజ్యమునుండి ప్రతిసంవత్సరమును మిక్కుటముగు ధనము హిందూదేశమునకు బట్టలకొరకే పంపబడుచుండెనని విలపించియున్నాడు. పిమ్మట వెన్నీసు, జినోవా, మొదలగు పట్టణము లావర్తకమునే సాగించుచుండెడివి. కాని ఈవర్తకమార్గములన్నియు ముసల్మానుల వశమగుటచే ఐరోపావర్తకులు వేరుమార్గములన్వేషింపవలసివచ్చెను. కావున ధైర్యవంతులగు కొందరు నావికులు సముద్రమార్గాన్వేషపరులై ప్రయత్నము చేయదొడంగిరి. ప్రథమమున నీయుద్యమమునందు పాల్గొన్నవి స్పెయిను పోర్చుగల్ దేశములు. పోర్చుగీసువారికి రాజసాహాయ్యము లభించుటచే 1498 వ సంవత్సరమున వాస్కోడిగామా ఆఫ్రికాఖండమును చుట్టి హిందూదేశములోనికాలికట్ పట్టణమును జేరి సఫలీకృతుడయ్యెను. దీనితోవారికి మంచివర్తకము

లభించెను. ఈవిజయమునకు కొన్ని సంవత్సరములకు పూర్వ మే. "కొలంబసు," యనునాతడు పశ్చిమముగ హిందూదేశము నకు మార్గము వెదకుటకు బయలుదేరి యమెరికా ఖండము జే రెను. కాని నూతనప్రపంచమును కనుగొనినది యాతడెరుం గడు. 1519 వ సంవత్సరమున మెలిగాను గోళమును చుట్టివచ్చె ను. కాని మార్గములను కనిపెట్టుటలో పనిపూర్తికాలేదు. ధనలాభమును, రాజ్య తృష్ణయువర్తక వికాసమునకు తోడ్ప డెను. వర్తకలాభముకొరకు పైచెప్పిన రెండుదేశములేగాక మిగిలిన ఫ్రాన్సు, హాలెండు, ఇంగ్లాండుదేశములు కార్యరంగ మునకు దిగెను. వర్తకస్థలములతోపాటు అధినివేశరాజ్యము లుకూడ స్థాపింపమొదలిడెను. దీనిలో జాంతర్జాతీయ కలహ ము సంభవించెను. 1493 వ సంవత్సరములో యారవ యలె గ్జాండరను క్రైస్థవమతాధిపతి ప్రపంచమునంతను రెండుభా గములుగా విభజించి పోర్చుగీసువారికిని స్పెయినువారికి నిచ్చి తినని ప్రకటించెను. కాని వేరొక మతకక్షకుజేరిన ఇంగ్లాండు మొదలగు రాజ్యములవారు పైయాజ్ఞను మన్నింపక యెవరి శక్తికొలదివారు నూతనప్రదేశముల నాక్రమించుకొనసాగిరి. రాజ్యసంపాదన విషయములో ఐరోపియనులు చేసినచర్యలు వాటిఫలితములు యధీనరాజ్యముల పరిపాలనా విషయములు మున్నగునవిగల సామ్రాజ్యచరిత్రను క్రమముగా పరీక్షింతము.

శ్రీ

# సామ్రాజ్యతత్త్వము.

## రెండవ అధ్యాయము.

### పెరూదేశము. స్పెనిషుసామ్రాజ్యము.

కల్పవృక్షమగు హిందూదేశముయొక్క ధనమును సంపాదింపవలయుననునాశయే ఐరోపాఖండములోని నావికాయుద్యమములకు కారణమై యమెరికాదేశమును కనుగొనుటకు మార్గముచూపెను. అమెరికాదేశమును జయించుటకు ప్రథమమున ప్రయత్నముచేసినది స్పెయినుదేశము. స్పెయినుదేశస్థులు జయించుటలో యవలంభించిన విధానము పెరూదేశ దండయాత్రను గమనించినచో విశదమగును. పెరూదేశము దక్షిణ అమెరికాలో పశ్చిమతీరమున సన్నముగాను నిడుపుగానున్న రాజ్యము. దానివెడల్పెచ్చట నరువది మైళ్ళకుమించదు. పశ్చిమతీరమున ప్రయాణముచేయు నౌకపైనుండి పెరూతీరమును చూచినచో నందనవనమును గాంచినట్లుండును. కొండలుపైని కొండలువరుసలు సూర్యకాంతిలో వెండికంటె ధవళముగా మెరయుచుండు మంచుశిఖరములు, ప్రకృతికి వింతసౌందర్యము నొడగూర్చుచుండును. తీరముననున్న యిసుక ప్రదేశములు వ్యవసాయముల కనుకూలములు గాకున్నను దేశస్థులు బుద్ధికౌశ

ల్యముచే నింతరీతిని నదీప్రవాహములను సెలయేళ్లను యానకట్టలచేతను, తదితర మార్గములవల్లను యరికట్టి ప్రకృతిని సానుకూలముచేసుకొనిరి. ఎత్తుకొండలపైనున్న పీఠభూముల మీద వారు గృహములను నిర్మించుకొందురు. గ్రామగ్రామమునకు సంబంధమున్నకై కొండలపైననే మంచిరాచబాటలను నిర్మించుకొనిరి. పెరూరాజులకు ముఖ్యపట్టణమయిన జుకో నగరవైభవము కోటనిర్మాణమునాటి పాశ్చాత్యులకు విభ్రమము గొలిపియుండెను. తమదేశముయొక్క నామమేది యాయాదేశస్థులెరుగరు. "పెరూ" యనునది స్పెయిను దేశస్థులుచేసిన నామకరణము. పెరూరాజులను వారిభాషలో "ఇంకా" లందురు. "ఇంకా"లప్రభుత్వము నిరంకుశత్వమయినను సరళమగు ప్రజాభిప్రాయమన్నన గలిగియుండెను. రాజ్యమంతయు నాలుగురాష్ట్రములుగా విభజింపబడెను. ప్రతిరాష్ట్రమునకును రాజప్రతినిధి గలడు. పలుచోటుల న్యాయవిమర్శకులుండిరి. పీతగాయిదా నయినను అయిదురోజులలో పరిష్కరించి తీరవలయును. న్యాయము సరిగాజరుగుచున్నదో లేదో చూచుటకు ప్రతిన్యాయాధీశుడును తనతీర్పుల నెలసరిపట్టిగను రాజువద్దకు పంపవలయును. ఇంతియేగాక రాజు సపరివారముగా దేశమంతటను పర్యటనముచేయుచు ప్రజల మొరలను వినుచుండెడివాడు.

ఇట్టి పెరూదేశమునుగురించి స్పెయినుదేశస్థులు విని

యుండిరి. ఆదేశమునకు సమర్థుడును బలవంతుడునునగు రాజు
గలడనియు, అక్కడ బంగారము మిక్కుటముగా దొరకుననని
యు, వినుటచే వీరి కాశలు మిక్కుటమాయెను. పిజారోయను
నాతడు స్పెయినురాజిచ్చిన యనుజ్ఞతో యాదేశమును జయిం
చుటకు దండయాత్రను వెడలించెను. ఆకాలమున పెరూదేశ
మునకు రాజు 'అతహువల్లప' యనునాతడు అతడతిసమర్థుడును
శౌర్యవంతుడునగు రాజు. స్పెయినువారు తన రాజ్యమును జేరు
టగాంచి వారిని సన్మానించుటకొక రాయభారమునంపెను.
వారిమాటలనమ్మి తానుస్వయముగా వారు విడిచియున్న ప్రదే
శమునకు సపరివారముగా నేగెను. సేననాతను శిబిరములకు
దూరముగావిడిచి కొద్దిమందితో శిబిరములను ప్రవేశించెను.
అతహువల్లప పాలకిని దిగినతోడనే యొకక్రీస్తు మతబోధకు డాత
నిచెంతకువచ్చెను. ఆతని నాహ్వానింపక తనమతమునుగురిం
చియు దాని తత్వమునుగురించి యుపన్యసింపదొడంగెను. కొం
తసేపు మాటలాడి తమమతగురువైన పోపు యుత్తరవుప్రకా
ర మాపెరూరాజ్యమంతయు స్పెయినుదేశమునకు చెందున
నియు అతహువల్లప తమకుసామంతుడనియు, గంభీరముగాపలి
కెను. ప్రకృతిసిద్ధముగా స్వేచ్ఛాప్రియుడయిన "అతహువల్లప"
యానూతనపురుషులు తనస్వతంత్రతను ప్రశ్నించుటచూచి రో
షపూరితుడయి బొమలుముడివైచి "మీమతముసంగతి నాకు తె
లియదు. నాదేశమునకు సంపూర్ణహక్కుగల చక్రవర్తిని.

మీారెందుకు యిచ్చటకువచ్చితిరో జవాబు చెప్పవలశియున్న
ద”నిచెప్పి తనచేతిలోనున్న బైబిలుగ్రంధమును క్రిందజారవే
సెను. ఇది వంకగాపెట్టుకొని ఫిజారో యిదివరకే తయారుగానుం
చిన దనసైనికులకు సంజ్ఞచేసెను. దానితోవారు అతహుల్లప
పై దుమికిరి. పెరూచక్రవర్తి యాశ్చర్య మగ్నుడయ్యెను.
తాను వారిని సన్మానించుటకువచ్చెను. కాని తనగృహమునకు
వచ్చిన యతిథినిచెరబట్టెడు ఐరోపారాజ్యనీతిని యాతడుగుర్తెరి
గియుండలేదు. తమరాజుయొక్క ప్రాణములను కాపాడుటకు
పెరూసైనికులడ్డుబడి చిత్రవధగావింపబడిరి. కొందరు చరిత్రి
కారులు రెండువేలమంది హతులయిరనియు మరికొందరు పది
వేలుమంది చంపబడిరనియు వ్రాసియున్నారు. ఎంతసంఖ్యయ
యినను స్పెయినుదేశజుల యీదురంత మాచంద్రతారార్క
ముగ పాశ్చాత్యరాజనీతికి వన్నెబెట్టుచుండును.

అతహుల్లప ఖైదీగా పరిగణింపబడినను రాజమర్యాదల
నందుచుండెను. ఫిజారో స్వయముగా నాతనికి క్రీస్తుమతమును
బోధింపసాగెను. తాము క్రీస్తు సువార్తను ప్రచురించుటకు
వచ్చినారమనియును, దానిని సన్మానింపనివారి కిట్టిగతి గలుగు
ననియు యాతడు పలుమారులు చెప్పదొడంగెను. ఈనీతివా
క్యముల బరికించు పిజారోహృదయమందు మతభక్తికంటె ధనా
శాభావమెక్కుడుగా నున్నటుల అతహుల్లప గ్రహించి “నేనుం
డినగదిలో నాయెత్తున బంగారమును వెండిని సమర్పించెదను.

చాశ్వేచ్ఛనొసంగుమని చెప్పెను. ఫిజారో సమ్మతించెను. రెండునెలలోగా పీరువిడిచియున్న కాక్సామార్కా నగరమునకు ధనరాశులు జేరసాగెను. రాజధనాగారములోని సొత్తులతో బాటు పెరూదేశస్థులు రాజుపైభక్తిచే తమధనమునుగూడ నర్పింపసాగిరి. అతహ్వల్ప చెప్పినరీతిగా యొకగదిలో బంగారమును రెండవదానిలో వెండియు సమకూర్చబడియెను. ఇట్టి ధనరాశులుజూడ దేశైశ్వర్యమునుగూర్చి స్పెనిషువారి కాశ్చర్యము గలుగజేసెను. ఈసమయమునకు "ఆలిమాగ్రో"యను వేరొక సేనానాయకుడువచ్చి ఫిజారోను గలుసుకొనెను. ఇదివరకే పెరూవాసులు తమ్ముముట్టడి వైచెదరని జంకుచున్న ఫిజారో యీనూతన సహాయము నాధారముజేసుకొని ధనసర్వస్వము నుద్యోగ అనుక్రమణముగా స్వసైనికులలో బంచసాగెను. బంగారుబరువు 1326, 539 పౌనులనియు దానిఖరీదు సుమారు 35000000 కాసులనియు వెండిఖరీదు 51610 మార్కులనియు నాటిస్పేనిషు చరిత్రకారులు నిశ్చితముగా వ్రాసియుండిరి. ఈధనమును సైనికులు తమలో తాము పంచుకొనిరి. గాని మతబోధనకు వచ్చితిమని డంభములుపల్కిన వీరుక్రైస్తవ దేవాలయములకు పదవవంతైనను సమర్పించలేదు. ఏమిమతావేశము!

ధనవిభజనానంతరమైనను వారియాశలు పూర్తిగాలేదు. ఇంకనెంత ధనమున్నదో యనునూహ ప్రబలసాగెను. పెక్కు

మంది ఖైదీని యురితీయుమని పిజారో చెప్పసాగిరి. కొందరు న్యాయ మనస్కు లిట్లుచేయుట నీతిబాహ్యమును క్రూరము నని చెప్పసాగిరి. 29-8-1533 తేదీని అతహుల్లపను గొలుసులతో బంధించి యురిస్తంబముకడకు గొనిపోయిరి. ఆఖరున మాయచేసి యాతని క్రీస్తుమతస్థునిగా నొప్పించిరి. మరునిముషములో నుప్పదిసంవత్సరముల ప్రాయముగల సూర్యవంశీకుడగు యీ పెరూరాజాధిరాజు స్పేనిషువారల యీర్ష్యాగ్నిలో మ్రగ్గి పూర్వులజూడనేగెను. పిమ్మట పెరూసైనికులు ముందునకుసాగి తమ్మెదిరించిన రాజులేని సైన్యముల నోడించి పట్టణముల కొల్లగొని యగ్నికాహుతిచేసి చివరకు ముఖ్యపట్టణమగు కుజ్కోనగరమును చేపట్టిరి. ధనావిభజనములో ఆలేమాగ్రో పక్షమునకును పిజారోపక్షము నంతఃకలహములు సంభవింపగా గేస్కాయను నాతడు వీరలను శాంతింపజేసి దేశమునకు శాంతినొసగెను. కాని పెరూదేశస్థుల జన్మస్వాతంత్ర్యమును ధనమును పరులవశమయ్యెను. వారిపాలనా కష్టము లేతీరునుండెనో పైవిధానమే సూచించును. కాని కొంతకాలమునకు స్పెయిను పటుత్వము శక్తియు సడలసాగెను. దానితో పెరూస్వాతంత్ర్యమును బ్రకటించుకొని నేడు ప్రజాస్వాతంత్ర్యరాజ్యమై విలసిల్లుచున్నయది. కాని యీరాజ్యములో నేడు పాశ్చాత్యుల జనమునుగాని ధనమునుగాని ప్రజలు జేర్చుటకిచ్చగింపరు.

పెరూతోపాటు దక్షిణామెరికా ఖండములో ఐరోపియ
నుల హస్తగతమయినది బ్రెజీలుదేశము. ఇది పోర్చుగలు వశ
మయ్యెను. సారవంతమయిన యీప్రదేశము పోర్చుగలునకు
ముఖ్యమయిన యాస్థిగానుండెను. కొంతకాలమయిన వెనుక
పోర్చుగలు రాజవంశములో నొకశాఖవారు స్వయముగా
నక్కడనే పరిపాలనను చేయుచుండిరి. మొట్టమొదట 1822
సంవత్సరములో బ్రెజీలు స్వాతంత్ర్యమును బ్రకటించుకొనియె
నుగాని జయమొందలేదు. 1888 లో దేశములో బానిస
వృత్తి మాన్పబడియెను. 1889 సంవత్సరములో రక్తపాత
ములేనివిప్లవము మూలకముగా పోర్చుగలు రాజవంశమును
బహిష్కరించి బ్రెజీలు ప్రజాస్వాతంత్ర్యరాష్ట్ర మయ్యెను.
మధ్యఅమెరికాలోని మెక్సికోరాష్ట్రముకూడ ప్రథమమున పెరూ
దేశమురీతినే యాకాలములోనే జయింపబడెను. అదికూడ స్పె
యిను హస్తముల విదలించుకొని నేడుపేరుపొందిన ప్రజారా
ష్ట్రముగా విరాజిల్లుచున్నది. తెల్లదొరలు యధీనములో నున్నం
తకాలము ధనస్వాతంత్ర్యములులేక బాధలుపడిన యాప్రదేశ
ములు నేడు ప్రజాస్వామ్యములై ధనవంతములును కీర్తివంత
ములునయి విరాజిల్లుచున్నవి.

శ్రీ

# సామ్రాజ్యతత్వము

## మూడవ అధ్యాయము.

### హిందూదేశము ౧.

హిందూదేశ మహాచరిత్రములోని యాంగ్లమహాయుగమును వ్రాయుట రెండుపెద్దసంపుటములపనియగును. కావున పరిపాలనా విషయములో పాలకులదృష్టిని విమర్శించుటతోనే మనము సంతుష్టులము కావలసియున్నది. వెనుకటి యధ్యాయములో వ్రాసినటుల 1498 సంవత్సరములో పోర్చుగీసు నావికుడగు వాస్కోడిగామా కాలికట్టు పట్టణమును జేరెను. ఎవరును పోటీచేయువారు లేకుండుటచే హిందూదేశ వర్తకకము వారికి పూర్తిగా లభించెను. వారి గవర్నరగు "అల్బూకర్కు" వంటి సుప్రసిద్ధపురుషుని సామ్రాజ్యస్థాపనాప్రయత్నములు యీక్రింది కారణముల వలన వ్యర్థములయ్యెను. పోర్చుగీసువారు బ్రెజీలువిషయమై నెక్కుడు శ్రద్ధపుచ్చుకొనసాగిరి. హిందూదేశములో సరిగా వర్తకము చేయుటకంటె అరేబియనుల ఓడల దోచుకొనుట వారికి లాభకారిగా గాన్పించెను. దానికితోడుగా వారు దేశీయులను తమ మతప్రచార విషయ

ములో బాధపెట్టసాగిరి. ఇందువలన వారి వర్తకము చాల కాలము నిలువలేదు. కాని నేటికిని వారికి ఈ దేశములో గోవా, డైయ్యు, డామర్ పట్టణములు గలవు.

నూరు సంవత్సరములు గడచునాటికి డచ్చి, యింగ్లీషు, ఫ్రెంచివారలు వర్తకమునకయి తయారైరి. దీనితో వీరలకు పోరాటములు సంభవించెను. 1600 సంవత్సరాంతమున తూర్పుయిండియా వర్తకసంఘము లండనులో స్థాపింపబడెను. పిమ్మటవారు హిందూదేశమునకు వచ్చి వర్తకమునకై కొన్ని ప్రదేశములను సంపాదించిరి. మద్రాసు పట్టణమును చంద్రగిరిరాజునొద్ద కొనిరి. బొంబాయి యాంగ్లేయరాజునకు పోర్చుగీసువారిచే వరకట్నముగా నీయబడెను. వీటితోపాటు కలకత్తా, సూరత్, మచిలీపట్టణము మొదలగుచోట్ల వీరు వర్తకస్థానములను స్థాపించిరి. పిమ్మట వచ్చిన ఫరాసువారు మాహీ, సూరత్, పుదుచ్చేరి, చంద్రనగరు పట్టణములలో వర్తకస్థానముల నేర్పరుచుకొనిరి.

వర్తకమూలమున జేయు ధనసంపాదనయందు దక్క రాజ్యసంపాదనాభిలాష ప్రథమమున వీరెవ్వరికిని లేదు. కాని దేశములోని సమకాలిక పరిస్థితులు వారికీవిషయములో తావొసంగెను. బలవంతుడగు మొఘల్ చక్రవర్తి లేకుండుటయు, చిన్నచిన్న స్వతంత్రరాజు లైకమత్యములేక పోరాడుకొనుటయుగూడ వారికి కాలిడుటకు స్థానమొసంగెను. వారిట్టిపరిస్థితు

లలో నప్పుడప్పుడు నీతిబాహ్యమైన కార్యముల జేసి యఖ్యాతిప్రసిద్ధిని గాంచిరి. న్యాయ విమర్శకులును, విద్యావంతులునగు యాంగ్లేయులు ప్రథమమున వచ్చినపుడు కొన్ని యవినీతికార్యములు జరిగియుండక పోవునేమోగాని యప్పుడు పాలకులగుట తటస్థించిన కంపెనీ గుమస్తాల సాంఘికవ్యవహారములును, పాలనాచర్యలును బాగుగ నుండలేదు. సెంటు జార్జికోటకు లండను నుండి పంపబడిన జనవరి 1911 తాలూకు 14 వ వుత్తరవులో భోజనములవద్ద యల్లరులు హెచ్చుగాజరుగుచున్నవనియు గుమస్తాలునగు వారా లనవసరకార్యముల జేయుచున్నారనియు, యట్లుజేయుట పాడిగాదనియు మొదలింపు గలదు. మర్యాదకొరకు ప్రేల్చుచు ఫిరంగులలో మందుఖర్చు హెచ్చుగానున్నదని వారేవ్రాసిరి. 26—4—1721 తేదీని సెంటు జార్జికోటకు పంపిన 17 వ నెంబరు వుత్తరువులో జూదమాడుట హెచ్చుగా నున్నదనియు, గొప్పస్త్రీలుగూడ పాలుగొనుట విచారకరమనియు, యట్లుచేయుట చాల తప్పనియు మొదలింపు గలదు. న్యాయముగా ప్రవర్తించవలెననియును మనకు ధనముగాని రాజ్యమువలదనియు, శాంతిగానుండుడనియు, బంపిన డయిరక్టర్ల యుత్తరువులిట్టియుద్యోగియుల హస్తములలో నెట్టి విపరీతపరిణామముల గాంచెనో భావిచరిత్రయే లోకమునకు వెల్లడించినది.

ఐరోపాఖండమున యుద్ధము జరిగినపుడెల్ల యీ దేశము

లోగూడ ఆంగ్లపరాసు దేశస్థులు పోరాడజొచ్చిరి. 1740-48 వరకు ఇక్కడకూడ పోరాటముజరిగినను సంధికాలములో యవరిపు దేశములవారు వశపర్చుకొనిరి. పరాసు ప్రతినిధి యగు డూప్లే రాజనీతికి పెట్టినదిపేరు. వర్తకమున సంపాదించుకొనుట కంటె లాభముకంటె రాజ్యసంపాదనమే శ్రేష్ఠమని యాతడు తలంచెను. కాని స్వదేశములోని కంపెనీయధికారు లాతని చర్యల సమర్థించెడువారు కారు. అందుచేత యాతనితలంపులు వ్యర్థమయ్యెను. ఆంగ్లేయులపరిస్థితు లిట్లుగానుండుటచే వారికి జన, ధన సహాయములు స్వదేశమునుండి లభించెను.

ఈకాలములో నార్కాటు నన్వరుద్దీను బరిపాలించుచుండెను. అంబూరు యుద్ధానంతర మాతడు మరణించెను. ఆసింహాసనమునకు చందాసాహేబు ప్రయత్నింపసాగెను. పరాసు లాతనికి దోడ్పడి యన్వరుద్దీను కుమారుడు మహమ్మదాలీని తిరుచునాపల్లిలో ముట్టడింపజేసిరి. మహమ్మదాలీకి యాంగ్లేయులుదోడ్పడిరి. క్లైవను యొకసేనాని నార్కాటును వశపర్చుకొనగా చందాసాహేబు కుమారుడు దానిని ముట్టడించెను. ముట్టడింపబడిన 500 సైనికులలో 300 భారతీయులు. వారు గంజితాగి అన్న మితరులకిచ్చి కోటను రక్షించుకొనిరి. పిమ్మట చందాసాహేబు పరాజితుడయ్యెను. మహమ్మదాలీ కర్నాటకప్రాంతములకు నవాబయ్యెను. ఆకాలమున మదాసు ప్రభుత్వ కార్యాలయములో "పాలుబెన్ఫీల్డు" యను

గుమాస్తాగలడు. ఆతడు నవాబునకు దుర్వ్యయములు మప్పి యప్పులపాల్జేసెను. పెట్టుబడి తానే పెట్టి యన్యాయముగను, న్యాయముగను గూడ యప్పుల నపరిమితముగా పెంచి చాల ధనమును సంపాదించెను. పర్యవసానమేమయినదో 1801 సంవత్సరమున వెల్లస్లీ యప్పులక్రింద యీరాజ్యమును వశపర్చుకొనెనని వ్రాసినచో విశదమగును. ఈకాలములోనే నిజాము రాజ్యము కొరకు నాజరుజంగ్, ముజఫరుజంగ్ యనువారలు పోరాడుచుండిరి. పరాసులు సహాయముతో ముజఫరుజయించెను. 8 సంవత్సరములకాలము రాజ్యము నడపి బుస్సీయను సేనాని పరాసులకు బహుమానముగా నుత్తరసర్కారులను సంపాదించెను.

ఈసమయమున బంగాళమును పరిపాలించుచున్న నవాబు యువకుడగు సురాజుద్దౌలాయను నాతడు. ఆయన విదేశీయులను దనరాజ్యమునుండి బహిష్కరింప నెంచి, తన స్వాజ్ఞలకు వ్యతిరిక్తముగా కోటను మరమ్మతు చేయుచున్న యాంగ్లేయులపై ప్రథమమున దాడివెడలించెను. కలకత్తా కోట సులభముగా యాతని వశమయ్యెను. ఇది జరగిన పిమ్మట క్లైవు బంగాళమున కేగి, నవాబును జయించు నుపయోగముతో యాతని ముఖ్యసేనానియగు మీర్జాఫరుతో కుట్రచేసెను. దీని సంగతి నెరంగిన యమచందను వర్తకునకు 30 వేలకు పోర్జరీనోటు వ్రాసియిచ్చెను. యీసహాయ్యముతో 1757 సం॥లో ప్లాసీ

యుద్ధము నవలీలగా జయించి మీర్జాఫరును నామమా త్రముగా నవాబునుజేసెను. ఈజేసిన సహాయమునకై క్లైవున కొక జిల్లా బహుమతియు, 30 వేల పౌను లాదాయమును, ఇతర యుద్యోగియులకు బహుమానములును (లంచములు గాక మరేమి?) లభించెను. దీనితో మీర్జాఫరు ఖజానాయును, దానితోబాటు దేశమును పరిపాలనయును దుస్థితిలోనికివచ్చెను. పైగ చరిత్రకారుడగు మాల్కము యొక్క క్లైవునకే గాక యాకాలమున కంపెనీయుద్యోగియులందరకు గూడ ధనాశ యుండినీరెనని వ్రాసియున్నాడు.

ఇదంతయు జరిగినపిమ్మట క్లైవు స్వదేశమునకు వెళ్ళెను. కంపెనీయుద్యోగియులు చేయుఅకార్యములకు పరిమితిలేకుం డెను. లంచములును, నౌఖరులు స్వాతంత్ర్యకమును పెచ్చు మీరెను. పరిపాలన సరిగాలేదను మిషపెట్టి మీర్జాఫరు పద చ్యుతుడు గావింపబడియెను. తరువాత మీర్ ఖాసిము యను మీర్జాఫరునియల్లుడు నవాబుచేయబడెను. ఈయుపకారమున కాతడు కంపెనీవారికి మూడుజిల్లాలను నౌఖరులకు కొందరు చరిత్రకారులు వ్రాసినటుల 200000 పౌనులు బహుమానము లక్రిందను దయచేసెను. కాని మీరుఖాసిము తనమామగారి వంటి యశక్తుడుగాడు. ఏనాడు దానుతనరాజ్యములో కంపెనీవా రుగాక, నౌఖరులుగూడ పన్నులనీయకుండ స్వాంతవ్రర్తకము జేసుకొనుట సరికించెనో, నాడే యాతడధికారులనుమందలిం.

చెను. అందువలన లాభముగానక యాయన్యాయవర్తకమును నిర్బంధించెను. దానిపైని కంపెనీయధికారులు యుద్ధమును ప్రకటించిరి. బక్సరులోజరిగిన సంగ్రామములో మీరుఖాసి మున కయోధ్యానవాబును, షాలము చక్రవర్తియు సహాయ పడినను జయము కంపెనీకే లభించునటజేసి వారుతిరుగ ముసలి మీర్జాఫరును నవాబునుగాజేసి యిచ్ఛను వ్యవహారములు సలుపసాగిరి. క్లైవు తిరుగ బంగాళమునకువచ్చి నౌఖరుల దు ర్నయముల మాన్పుటకును, పరిపాలన నడుపుటకును ద్వంద్వ ప్రభుత్వవిధానమును సృష్టించెనుగాని దేశముయొక్కయు పాలనయొక్కయు వ్యవహార మిసుమంతయు చక్కబడలేదు.

రాబర్టుక్లైవునకు దరువాత వారను హేస్టింగ్సు గవర్న రయ్యెను. ఈతనికాలములో రెగ్యులేటను చట్టమమలులోనికి వచ్చుటనుబట్టి బ్రిటీషుస్థానముల కన్నిటికిని యీతడే గవర్నరు జనరలాయ్యెను. ఇతడు మిగిలిన ప్రదేశములన్నిటికి ముఖ్యపరిపా లకుడాయెను. హేస్టింగ్సుపరిపాలనాకాలమునందే మహారా ష్ట్రులతో ప్రథమయుద్ధము సంభవించెను. మద్రాసురాజధాని యీ సమయముననే మైసూరునవాబగు హైదరాలీదండయా త్రలకు గురియయ్యెను. అతికష్టముపైన మద్రాసుకోట సంర క్షింపబడి సంధిగావింపబడియెను. కర్నాటనవాబగు మహ మ్మదాలీ, పాలు బెన్ఫీల్డు మొదలగువారి దుర్నీతులకు గురియై దివాలాస్థితియందుండెను. ఈతడే యన్యాయముగ నయో

ధ్య నవాబునకు సహాయపడి స్వేచ్ఛాపరులగు రోహిలాలను రోహిలుఖండను వారిరాజ్యప్రదేశమును నాశనము గావించె ను. పోర్జరీకేసుమీద నందకుమారుడురితీయబడియెను. ఇవి టులుండ చైతుసింగు విషయమునందును అయోధ్యబీగముల విషయమందును హేస్టింగ్సుచర్య మిగులనన్యాయమైనది.

చైతుసింగు కాశీపట్టణమునకు రాజు. అతడు $22\frac{1}{2}$ లక్షలురూప్యములు కంపెనీకి కప్పముగట్టుచుండును 5-7-1775 సంవత్సరములో జరిగిన సంధిప్రకార మింతకన్న నెక్కుడు కప్ప మీయనక్కరలేదని కంపెనీవారు వ్రాసియిచ్చిరి. కొంతకాలము గడచినబిమ్మట యుద్ధకాలమను వంకపైని హేస్టింగ్సు 500000 రూప్యము లెక్కుడుగోరెను. రాజు గడువుగోరినను హేస్టింగ్సు బలవంతముగా వసూలు చేసెను. మరుచటి సంవత్సరముగూడ నిట్లుకోరగా రాజు 2 లక్షలు లంచమిచ్చినను 500000 రూప్యము లెక్కుడుసీయక తప్పినదిగాదు. పిమ్మట శాశ్వతముగా పన్ను లెచ్చుచేయుట కొరకు హేస్టింగ్సు స్వయముగా కాశీపట్టణమునకు వెళ్ళెను. రాజు తన యసమర్థతను వెల్లడించి పన్ను నెక్కుడుగా నీయ ననెను. దానిపై రాజు బంధింపబడెను. అప్పుడు ప్రజలు తిరుగబడి దమ యసమ్మతిని వెలిబుచ్చినను పరిగణింపక వేరొకనిని 4000000 రూప్యములు అనగా $17\frac{1}{2}$ లక్షల రూప్యము లెక్కుడు నిచ్చునట్లుగాజేసి రాజ్యమునొసంగెను. ఇక అయో

ధ్య బీగముల (అనగా రాణులు)నూ చేసిన యన్యాయమును బరి కింతము. అయోధ్యనవాబు తల్లి యొద్దను, పితామహియొద్దను చాలధనముండెను. దాని నపహరించుటకు హేస్టింగ్సు తనసైని కులను సహాయముగాబంపి నవాబుద్వారా ధనమును వశపర్చు కొనెను. ఆహా స్త్రీలైనను జంకలేదు! హేస్టింగ్సు పరిపాలనా చర్యలను కొందరు యాంగ్ల చరిత్రకారులు మన్నించుచు ప్రియ త్నింతురు. దేశము పరిస్థితులట్టివట! కంపెనికి ధనము లేకుండె వట! అందుకొరకాతడిటుల చేసినను వసూలయిన ధనమును కంపెనీకే జమకట్టెనట! అందుచేత నిర్దోషియట. కాని మెకాలె, దగాధునికాంగ్లచరిత్రకారు లీచర్యలను మన్నించుటకు యత్నిం పరు. హేస్టింగ్సు మరల యాంగ దేశమునకు జేరినపిమ్మట యాతనిపై దావా చేయబడెను. ఏడు సంవత్సరములు విచారణ జరగెను. బర్కు మొదలగువారు యాతనికుతంత్రముల వెల్ల డిజేసిరి. అయినను పర్యవసానము సాంప్రదాయానుసారముగా హేస్టింగ్సునకే జయమొదగూర్చెను. దావాలోని యన్ని కార ణములపైనను యాతడు నిర్దోషియని తీర్మానింపబడెను. ఆఖ రకు చైతుశింగు విషయములోను, బీగముల విషయములోను ప్రభువులు దమసమ్మతుల నిచ్చుచు ౨౩గురు నిర్దోషియనియు, ౬గురు దోషియనియు జెప్పిరి. ఆహా నేడుగూడ ప్రభువులసభ డయ్యారుని నిర్దోషి గావించె ననుటలో పూర్వపు సాంప్రదా యమును మించినవింతనేమియు జేయలేదు.

హేస్టింగ్సునకు బిమ్మట కారనువాలీసు గవర్నరుజనర లయ్యెను. ఈతఁడే బంగాళములో శాశ్వతముగా పన్నులను స్థిర పర్చెను. అందువలన నేటికిని యక్కడప్రజలు కొంతలాభము నందుచున్నారు. ఈతనితో 18వ శతాబ్దము ముగిసినది. ముందు తిరుగ తరువాత వారివిషయములను బఠింతము.

శ్రీ

# సామ్రాజ్యతత్త్వము.

## నాలుగవ అధ్యాయము.

### అమెరికా యధినివేశములు

అన్ని ప్రదేశములలోవలెనే స్పెయినుదేశమే మొట్టమొదట యమెరికాలో ప్రవేశమొనర్చినదని వక్కాణించి యుంటిని. కాని కొంతకాలమగుసరికి పడమటి యిండియాదీవులు స్పెయినునకును, వర్జీనియాప్రదేశము ఆంగ్లదేశమునకును, కెనడా ప్రదేశములు పరాసుదేశమునకును లభించెను. పాశ్చాత్యులుత్తరయమెరికాదేశమును జేరుసరి కచ్చటనివసించుచున్నది యొక మోటజాతియగు యాదిమనివాసులు. వారికు తెల్లవారలు "ఎర్రయిండియనులు" అని నామకరణమొనర్చిరి. వీరలు శౌర్యవంతులయినను, వీరందరియొద్దను నూతనాయుధాపరికరములుగాని, జట్టులలో సంఘీభావముగాని లేకుండెను. కావున తెల్లవారలు వారిని బెదరించి రాజ్యమును సంపాదింపసాగిరి. కత్తులు, అద్దములు, బొమ్మలు మొదలగునవి వారికిజూపి వారియొద్దనుండి బంగారమును, తోళ్ళను, యితరములగు అమూల్య వస్తువులను సులభముగా పరిగ్రహింప

సాగిరి. వారలను నెమ్మదిగా నొప్పించి పెద్దరాజ్యవిస్తీర్ణముల గూడ సంపాదించిరి. వాటిని సాగుబడిచేసి ధనములను స్వీకరింప దొడగిరి.

వర్తక లాభమువల్లను, సమకాలిక మతదౌర్జన్యము వలనను, పలువురయిరోపాఖండమును వదలి విస్తీర్ణమగు నూతన ప్రపంచకమనదగు యమెరికాను జేరసాగిరి. ఇట్టి జట్టులలో ప్రథమమున యింగ్లాండునుండి యమెరికాకు జేరినదానిని "ఫిలిగ్రిమ్సు పాథర్సు" యనియందురు. వారు స్వదేశములలోని మతదౌర్జన్యమునకుదాళజాలక యమెరికాకు ప్రయాణమయిరి. అక్కడకుజేరి యొక్కొకజట్టు యొక్కొకప్రదేశము నాక్రమించుకొనుచు, తత్పరిపాలనకు ప్రజాస్వాతంత్ర్య నిబంధనలను తయారుచేసుకొనసాగిరి. ఇట్లుత్తర యమెరికాను జేరిన యీపాశ్చాత్యజాతులలో ఫరాసువారికిని, యాంగ్లులకును రాజ్యతృష్ణ సమరములకు డీకొల్పినది. చాలయుద్ధములు జరిగెను. ఆఖరకు కెనడా మొదలగు ప్రదేశములన్నియు యాంగ్లేయుల వశమయ్యెను.

ఆదిమనివాసులనుగూర్చి ప్రస్తుతము విపులముగా వ్రాయవలసినదేదియుగానరాదు. మతాంతరుల జేయుటచేతను, యితర దండనావిధానముల ప్రయోగించుటచేతను, నేడాదిమ నివాసులు చాలవరకు మటుమాయమయిరి. మిగిలిన యెర్ర యిండియనులసంతతి నేడు నూతననాగరికతా పరిస్ఫుట

భావములతో కొద్దిగా గానగును. ఉత్తరయమెరికాలో యుష్ణప్ర దేశములును, శీతలప్రదేశములునుగూడగలవు. అందు వర్జీం యా ప్రాంతరాష్ట్రము లుష్ణప్రదేశములోనివి. ఇచ్చట చెఱుకు విశేషముగా పండించుటకు వీళ్ళుగలవు. అయినను తెల్లదొర లెండలో కాయకష్టపడి పనిచేయలేకుండిరి. కావున వారికి జన సహాయము గావలసివచ్చెను. అందకొరకు వారాఫ్రికాఖండ మునుండి నీగ్రోలను తండతండములుగా తేసాగిరి. ఈబానిస వర్తకము ప్రపంచచరిత్రలో బహునీచమయినది. బానిస వర్తకులు నావలను అఫ్రికా పడమటితీరమునకు దెచ్చియుంచి కొందరు సమీపగ్రామములకు వెళ్ళి కొరడాలతో గొట్టియు, తదితరమార్గముల హింసించియు బలవంతముగా యాప్రజలను వేచియున్న యోడలపై నెక్కించి, యమెరికాలోని సంతలలో పశువులరీతిని యీనీగ్రో బానిసలను విక్రయించెడువారు. ఈ బానిసలను కొనుయజమానికి వానిపైని పరిపూర్ణహక్కు గలదు. వానిచేత కావలసినపనులు చేయించుకొనవచ్చును. ఆ ఖరునకు వానిప్రాణములనైన దీయవచ్చును. ఎద్దులవలె వారి చేత పనిచేయించుటయేగాక, వారికి మానవులకు సహజముగ గావలసిన భోజన, పోషణ, విశ్రాంతి సౌఖ్యములనీయక బాధ పెట్టెడువారు. విద్యలేదు. మానము తోటియజమానుల యధీ నము. వారి హైన్యతను గుర్తింప నెవరికిశక్యము? ప్రపంచకమంత తో యితరరాష్ట్రములలో గూడ కొంతబానిసత్వ వ్యవహారము

డెనని చరిత్రలు చాటుచున్నగాని యెచ్చటనుగూడ నిట్టిహీన స్థితియు, దుర్మార్గమును గానరాలేదు. 1860 వ సంవత్సరము నాటికిగూడ యమెరికాలో 3,953,760 బానిసలుండిరి. అప్పుడు కొందరు న్యాయమనస్కు లీబాధితులపక్షమున బోరాడి వారికి స్వేచ్ఛనొసంగజేసిరి.

అమెరికాలోని యధీనదేశరాజ్యములు న్యాయముప్రకారము స్వతంత్రములయ్యెను, ఆంగ్లదేశమునుండి బంపబడిన గవర్నరుల పరిపాలనకు లోబడియుండెను. కాని యచ్చటి బాసి సరాజ్యపరిపాలకులగు దొరలకున్న స్వాతంత్ర్యేచ్ఛచే గవర్నరుల యధికారము పూర్ణముగా చలాయించుటలేదు. ఇంగ్లండులాభముకొరకు దాము పరిపాలింపబడెడురీతి వారికిసుమంతయు గిట్టకుండెను. ఆకాలమున యింగ్లాండురాజయిన మూడవజార్జియు, ప్రధానమంత్రులును సామ్రాజ్యావేశపరులయిన యధికారప్రియులు. అందువలన యిరుదేశములవారికిని మనస్పర్థలు పెరుగజొచ్చెను. గ్రెనివిలుమంత్రి స్టాంపుశాసనముగావించి యద్దానివలన యమెరికాలోని వ్యవహారములన్నియు స్టాంపులపైని లిఖింపబడనిచో న్యాయసమ్మతములుగావని నిర్ధారించెను.

ఇదివరకే క్రోధపూరితులయియున్న యమెరికనుల కిది యగ్నిహోత్రమున నాజ్యము సమర్పించుటయ్యెను. పలువురు ద్వేషభావములు ప్రకటింపసాగిరి. కొన్ని రాజకీయ సంఘముల ప్రోత్సాహముచే యార్థిక బహిష్కారాస్త్రము ప్రయోగింప

బడియెను. అమెరికాలోనే యున్నిబట్టలు చాలినన్ని తయారు చేసుకొనుటకు మాంసాహారమును విసర్జించి గొర్రెలను సంహరించుటమానిరి. ఇంతవరకును గౌరవముగా పరిగణింపబడిన యాంగ్లదేశములో దయారుచేయబడిన దుస్తులు విసర్జింపబడియెను. న్యాయవాదు లాంగ్లేయులపక్షమున వాదించుట మానుకొనిరి. ధనాగారము ఇంగ్లాండునకు సొమ్ముబంపుట మానివేసెను. ఏతదుద్యమము మహాయుత్సాహముతోడను విజయవంతముగను కొనసాగింపబడుటగాంచి యింగ్లాండులో కలవరము గలిగెను. పలువురు సౌహార్ధహృదయులు అధినివేశ రాజ్యముల పక్షముబూని పనిచేయదొడంగిరి. గ్రెనివిలు పదచ్యుతుడయ్యెను. నూతనమంత్రి స్టాంపు చట్టమును రద్దుపరచెను. గాని యింతలో శాంతిచేకూరలేదు. మరుచటి సంవత్సర మమెరికాకు దిగుమతికాబడు కొన్నివస్తుసముదాయములపై సుంకము విధింపబడెను. మరల బహిష్కారోద్యమము ప్రజ్వలించెను. బోస్టనురేవులోని దేయాకు టోడలు ముంచబడియెను. పట్టణములో జరగిన గలభాలో సైనికులు బ్రజలపైని తుపాకుల బ్రయోగించిరి. ఉద్రేకముమిన్నుముట్టెను. పలువురు స్త్రీలు విందులయొద్దను, యితర సమయములయందును జాతీయ గీతముల బాడి దేశములో జాతీయతను, స్వాతంత్ర్యను పూర్ణత జెందించిరి.

4-7-1776 సంవత్సరమున ఫిలడల్ఫియాపట్టణమున

యధినివేశముల ప్రతినిధులు సభగాగూడిరి. నాడే వారు ప్రాపంచిక చరిత్రలో ఘనతగాంచిన స్వాతంత్ర్య ప్రకటనను గావించిరి. ఈవిప్లవరాష్ట్రములే నేటియమెరికా సంయుక్తరాష్ట్రములు. ఇంగ్లాండున కపారమయిన ధనము గలదు. సైనికులుగలరు. వారికి సరియగు శిక్షణమును యుద్ధకౌశలమును గలదు. సరిహద్దులలోని కెనడాపరగణాలు విప్లవకారులను జేరలేదు. విప్లవరాష్ట్రములలోగూడ పెక్కురాంగ్ల భక్తపరాయణులు గలరు. వారుయాంగ్లసైనికులకు జేయవలసిన సహాయములో వెనుకంజవైచరేదు ఇట్టిపరిస్థితులలో సంయుక్త రాష్ట్రములకు విజయమెట్లు చేకూరెనోవింతగా గన్పట్టవచ్చును. కాని వింతజెందుటనవసరము. సంయుక్తరాష్ట్రప్రజలు శిక్షితులయిన సైనికులుగాకపోయినను స్వాతంత్ర్యవారి మనంబులనావరించెను. ఆదివ్యజ్యోతి వారిమనంబులలో నుత్సాహము మిన్నుముట్టింపజేసెను. వారికి సమయమునకు తేజస్వాంతుడగు నాయకుడు లభించెను. బాధితుల రక్షణార్థము తేజస్వాంతుడగు నాయకుడు సహాయపడుట ప్రపంచకములోని యుత్కృష్ట ధర్మము. వాషింగుటనుసేనానికి ధైర్యస్థైర్యములు మెండు. ఓడింపబడినను నెగ్గినను సమానోత్సాహమును నిలుపుకొనుచుండెడివాడు. ఆంగ్లసైన్యము లాతనికి సకాలములో లొంగిపోయెను. ఆఖరున కింగ్లాండు దిగ్భ్రమజెంది సంయుక్తరాష్ట్రముల సహజస్వాతంత్ర్యము నంగీకరింపక తీరినదిగాదు. సంయుక్తరాష్ట్రములు నేడుమహాప్రతిభతో విరాజిల్లుచున్నవి. కాని యాచరిత్రను వ్రాయుట ప్రస్తుతోద్దేశములో నిముడ్చగలిగిన చిన్నవిషయముగాదు.

శ్రీ

# సామ్రాజ్యతత్వము

## ఐదవ అధ్యాయము.

### హిందూదేశము. ౧.

కారనవాలీసుప్రభువు హిందూదేశమునకు జేసిన యుపకారము బంగాళములోని శాశ్వతపన్నుపద్ధతి. ఆయన పిమ్మట వరుసగా గవర్నరుజనరలులుగావచ్చిన వెలస్లీ, మింటో, హేస్టింగ్సుగార్లకు రాజ్యసంపాదనాతృష్ణగాక వేరొండులేకుండెను. వెలస్లి టిప్పుసుల్తానునుజయించి మైసూరును స్వాధీనపర్చుకొనెను. పిమ్మట యాతడే "సహాయసైనికపద్ధతి" యను నూతనమార్గమును వ్యాపకములోనికి దెచ్చెను. యుద్ధమార్గమున నైజామును, పేష్వాను అయోధ్యనవాబును లొంగదీయు మార్గమును గానక యీరాజ్యనీతి నవలంబించెను. యీపద్ధతిప్రకారము కంపెనీవారు భారతదేశములో ప్రధానరాజ్యపాలకులు. వీరికిట్టిహక్కులు యెట్లువచ్చెనో, యెవరిచ్చిరో యెరుకలేదు. దేశములో యీపద్ధతి కంగీకరించు స్వతంత్రరాజులు వీరుసహాయముగా బంపు సైన్యముల బోషింపవలయును. వీరుబంపు ప్రతినిధిని తమయాస్థానములో నుంచుకొ

నవలయును. ఆంగ్లేయేతర పాశ్చాత్య జాతులతో స్వతంత్రి ముగా సంధిజేసుకొనరాదు. ఇద్దరు స్వతంత్రరాజులకు వచ్చు తగాయిదాలను నీరే పరిష్కరింపవలయును. ఈపద్ధతికంతకును నిజమయిన యర్థము. స్వదేశరాష్ట్రములు స్వాతంత్రమును గోల్పోవలయుననుటకన్న వేరుగాదు. కత్తితో జయింపనేరక రాజ్యనీతిచే, కుతంత్రములచే స్వాధీనపరచుటకు పన్నినమార్గ ముకంటె యిదివేరుగాదు.

ఇష్టమున్నను లేకున్నను నైజాము ప్రభృతుల న్యాయ ముగా యీవిధానమునకు లోంగవలసినవారైరి. స్వదేశసం స్థానములలోనున్న కంపెనీవారి రాయబారులు లంచములి చ్చియు, తదితర మార్గములననుసరించియు స్వతంత్రరాష్ట్రము లను కంపెనీ యధికారమునకు లోబడజేయుటకు సాధనభూతు లైరి. ఈరాయబారులు పదేపదే చేసినచర్యలు మాడరన్ రివ్యూపత్రికలో కొంతకాలముక్రిందట ప్రచురింపబడిన యాక్రింది లేఖవలన విదితమగును.

ఉత్తరగోదావరిప్రాంతము,

24-8-1803.

టన్ కాముకాము.

మేజరుషాహిగారికి వ్రాసినలేఖలో.

"నేను కర్నలు క్లోజుగారికి వ్రాసినలేఖలనుబట్టి సరి యయిన సమాచారముల నెరుగుటకు మంత్రికి లంచమీయు మని యాతని [illegible]ల మీరు గమనించియే యుందురు."

విలింగుటను సేనాని.

వెలస్లీకిపిమ్మట మింటో ప్రభువును. హేస్టింగ్సును, సిక్కులు మొదలగువారలపై యుద్ధములుసాగించి యారాజ్యములగలుపుకొనిరి. మహారాష్ట్రసామంతులను వేరువేరుగానోడించి శివాజీ సామ్రాజ్యమును గలుపుకొనిరి. వీరిద్దరికాలములో హిందూదేశము చాలవరకు కంపెనీ స్వాధీనములోనికివచ్చెను. తరువాత విలియంబెంటిక్కు కొన్నిసాంఘిక మార్పులకు కారకుడయి సహగమనమును మాన్పించెను. ఈయనకాలములోను, పిమ్మట డలహౌసీకాలములోను రైలుమార్గములు, తంతులు వగయిరాలు స్థాపింపబడియెను. ఈ డలహౌసీయే చరిత్రలో ప్రసిద్ధతబడసిన "దత్తస్వీకారనిరసనపద్ధతి" ని స్థాపించి వెలస్లీకంటె యన్యాయముగా మిగిలినరాజ్యముల వశపర్చుకొనెను. దీనిప్రకారము ఔరసులు లేకుండ గతించిన రాజులరాజ్యములు, దత్తతపుత్రులకు జెందకుండగా కంపెనీవారివశము జేసుకొనబడుచుండెను. ఈరీతిని సతారా, జాన్సి, తంజాపూరు మొదలగు రాజ్యములు కలము సహాయముతోనే స్వాధీనము చేసుకొనబడియెను. జాన్సిరాణి లక్ష్మీభాయి యెన్నిమారులుకోరినను దత్తత కనుజ్ఞచేకూరలేదు. ఈయనకు తరువాత కానింగు ప్రభువుకాలములో సుప్రసిద్ధమగుశిపాయికలహము లేక విప్లవము తటస్థించెను. ఏతద్విప్లవమునకు కారణముగా రైళ్ళను జూచియు, తంతులనుజూచియు ప్రజలు జెందిన దిగ్భ్రమయేయని జెప్పుట సాహసము. తుపాకి తూటాలకు క్రొవ్వురాయుటయే

దీనికి ముఖ్య కారణమని యెంతవ్రాసినను నిజమునకు న్యాయ మయిన వేరు కారణములు చాలగలవు. రాజ్యములుపోయిన వారసులును, ధనమును, స్వతంత్రతను గోల్పోయిన ప్రజలును దీనిలో పాల్గొనియుండుట జూడ పరిపాలనాలోపములుగూడ దీనికి కారణములని తేటతెల్లమగుచున్నవి. ధీరురాలగు జాన్సీ రాణీ గూడ యుద్ధమొనర్చి శత్రువుల మన్ననగాంచెను. ఆమెతో బోరాడిన యొక సేనాని, "ఒకచిన్న రాజ్యమును పాలించుట కసమర్థయని మనము నిరసించిన యొకరాణి నేడు సేనానాయ కియై తన తేజమును వెల్గింప జేసినది." యని వర్ణించియుండెను. ఇరుకక్షులువారు చాలఘోరములు చేసిరి. ఆఖరునకు కలహ మడంపబడియెను. పిదప రాజ్యమంతయు కంపెనీవారి యధీన మునుండి దప్పింపబడి, యాంగ్లదేశపు రాజుల పాలనలోనికి మార్పబడియెను.

1857 వ సంవత్సరముతో తూర్పుయిండియావర్తక సం ఘమువారి పరిపాలన యంతమొందినది గావున తత్ప్రభు త్వ మెట్లుకొనసాగెనో గమనించుట యుక్తము. ఆంగ్లేయవర్త కులు బంగాళమును జేరుసరికి యాదేశము దివ్యవైభవములతో దులతూగుచుండెను. హౌసువెలుయను నాతడు రిపోర్టు పాంప్లె టు నెం 9 లో 21 పేజీలో వ్రాసిన యీక్రింది సంగతు లుదా హరణార్థములు "(నాడు) ప్రజలయొక్క యాస్తులుగాని, స్వే చ్ఛగాని యెంతయు భద్రముగా నుండెను. ఏబాటసారియు యి

నను, తనసొత్తుతోసహా, రక్షకభటుల సహాయముతో భద్ర
ముగా యొకమజిలీనుండి వేరొక మజిలీకి గొంపోవబడును.
ఈమండలములో రూపాయలమూటగాని, మరేదయిననుగాని
దొరకినచో, ఆదొరకిన యాతడు తక్షణమే యొకవృక్షమునకు
వ్రేలాడగట్టి సమీప రక్షకభటునకు దెలియ పర్చును.” ఇట్టిబం
గాళదేశము క్లైవు కాలమునం దేస్థితికివచ్చెనో మెకాలే
వ్రాసిన యాతని జీవితచరిత్రలోని యీ వాక్యములు తెలుపగ
లవు. “కంపెనీ సేవకులు దేశీయవర్తకమునంతను యధీనము
జేసుకొనిరి. దేశీయులను చవుకగా నమ్ముటకును, ప్రియ
ముగాకొనుటకును బలవంతముచేయసాగిరి. కంపెనీ సేవకుడు
ప్రతివాడును కంపెనీవారి పూర్ణాధికారమును చలాయించు
చుండెను. ఒక్క బంగాళములోనేగాదు. హిందూదేశములో
నెచ్చటజూచినను యాంగ్లేయులు వచ్చుసరికి పరిపూర్ణసౌఖ్య
ముపాలనచేయుచుండెను. పరమక్రూరుడని యాంగ్ల చరిత్రకారు
లచే వర్ణింపబడిన హైదరాలీరాజ్యముయొక్క పరిస్థితులగాం
చుడు. ఇదియుయొక న్యాయమనస్కుడగు యాంగ్లేయునిచే
వ్రాయబడియెను.

“ చాలయుద్ధములలో నిమగ్నుడయినను, స్వదేశ పురో
భివృద్ధియు, న్యాయమయిన రాజ్యాంగకార్య నిర్వహణమును
యాతనిహృదయమును సతతమునాకర్షించుచుండెడివి.

వృత్తికారుడును వర్తకుడును బాగుపడిరి. పంటలువృద్ధి

జెందెను. క్రొత్తవృత్తులు నెలకొల్పబడియెను. ధనము వెల్లువవై
దేశములోనికి రాగడంగెను. ఆతడురివిన్యూయధికారుల యక్రమ
చర్యలను తక్షణముదండించుచుండెను."

దీనితో సరిపోల్చినచో మహారాష్ట్రమును యయోధ్యను
వేరుగా వర్ణింప నక్కరయే లేదు. ఇట్టియానందనిలయములగు రా
జ్యములను కంపెనీవారు వశపర్చుకొనిరి. ఈనూతనప్రభుత్వము
నూరుసంవత్సరములు దేశములో పరిపాలించినపిమ్మటిస్థితి
1852 వ సంవత్సరములో కన్నులారజూచి ఫ్రెండు ఆఫ్ ఇండియా
పత్రికలో (1-4-1852) డాక్టరు మార్షమనుగారు వ్రాసినసంగ
తులవలన గుర్తింపనగును.

" బంగాళపు రహితులస్థితి యూహించుటకైనను వీలు
గానియంత దౌర్భాగ్యముగాను, యధఃపతితముగనున్నదను విష
యమున కెవరును బ్రతికూలాభిప్రాయమును జూపియుండలేదు.
శునకములకైన నివసించుట కయోగ్యమైన గుడిశెలలో నివసిం
చుచు చినిగిన గుడ్డపేలికల గట్టుకొనుచు తనకుగాని, కుటుంబ
మునకుగాని, దినమునకొకమారైన చాలినంతభుక్తిని సంపా
దింపలేకపోవుచు, బంగాళపురహితు మానవునకుండవలసిన
సాధారణ సౌఖ్యములైన లేకుండ బాధపడుచున్నాడు."

"అనంతమైన ధనమునుగలిగి తనపరిపాలకులను ప్రపంచ
కములోని రాజులలోకెల్ల ధనవంతములుగా జేయగలద" ని క్లయి
వు కండ్లారజూచి వర్ణించిన బంగాళము మార్షమనుగారి దృక్పథ

మున నెట్టిమార్పు జెందినదియు పాఠకులకు విశదమగ్చు వ్రాయ నక్కరలేదు. ఇట్టిపరిపాలనలోనికి దెచ్చుటకేగాబోలు డలహౌసీ దత్తతాధికారమునీయక జాన్సీరాజ్యము మొదలగునవి సంపాదించినది. ప్రజలనుండి యమితములగు పన్నులువసూలు చేయుటచేతను, దేశీయవృత్తులను నిర్దయత్రో నడచివైచుట చేతను ప్రజలు ధనవిహీనులయి యెన్నడు నెరుంగని కడగండ్లపా లుగావలసివచ్చినది. భూలోకస్వర్గ మని పేరొందిధనాతృష్ణపరా యణులగు పాశ్చాత్యవర్తకుల దృష్టినిబడిన యీ భారతవర్షము కాలానుగతిచేత దుర్భిక్షములకును, దారిద్ర్యమునకును నిలయ మైనది. డలహౌసిగారి రైల్వేలును, తంతులును బెంటిక్కుగారి సాంఘిక సంస్కరణములును మెకాలేగారి విద్యావిధానమును దేశమునకుపకార మొనర్చెనని యొప్పుకొనుటకుబూనుకొన్నను ఈపరిపాలనాతత్వమును దుర్భిక్షదారిద్ర్యములును మనుజుని కండ్లను గప్పజాలవు. సకలశ్రేయోదాయకములయి భారతదే శౌన్నత్యములకు కారణభూతములయిన స్వదేశవిద్యలనురూపు మాపి యాంగ్లవిద్యను దేశములో వ్యాప్తిజెందించి ప్రభువు లభీష్టసిద్ధిని గాంచిరి. ఆంగ్లవిద్యాప్రవేశమునకు ముఖ్యకారకు డగు మెకాలే ప్రభువువ్రాసిన యీక్రిందివాక్యములే నిజమును వెల్లడింపగలవు.

"మనకును మనము పరిపాలించు కోట్లకొలది ప్రజల కును నడుమ దుబాషీలక్రిందనుండు నొక తెగను మనము

తయారుచేయవలెను. ఈతెగవారు (ఆంగ్లవిద్యాభ్యాసకులు) రక్తమునందును రంగునందును భారతీయులుగను, అభిరుచులయందును, అభిప్రాయములయందును, నీతి నిరూపణయందును, మనోవికాసమునందును యాంగ్లేయులుగను తయారుగాబడవలెను."

ఇట్టి మహోద్దేశ్యములతో జేయబడిన పరిపాలనదైవవశమున యభీష్టసిద్ధినిగాంచి భారతదేశమును యధఃపతితమును జేసినది.

శ్రీ

# సామ్రాజ్యతత్వము

## ఆ ర వ అ ధ్యా య ము.

### ఆస్ట్రేలియా సమీపద్వీపములు.

ఆస్ట్రేలియా దక్షిణశాంతి మహాసముద్రమునందలి పెద్ద ఖండమగు ద్వీపము. దీనినిచాలకాలమునుండి పాశ్చాత్యులెరిగినను దానియొక్క యుపయోగమును గుర్తింపనేరకపోయిరి. కుక్కు యను నౌకాధిపతి 1769 సం॥లో యాంగ్లేయుల తరఫున యిచ్చట జేరెను. ద్రవ్యసంపాదనా మార్గమేమియు గానరాకుండుటచేత దానిని పూర్ణముగా వారువశపర్చుకొనలేదు. కాని "సర్ జోసఫ్ బేక్సు" యను నాతడు దానిని నేరస్థులకు నివాసస్థానముగా జేసినబాగుండునని యాంగ్లేయ ప్రభుత్వమునకు సలహానిచ్చెను. సుమారొక శతాబ్దముకాలము ఆంగ్లనేరస్థులను యమెరికా యధినివేశములకు బంపు వాడుకగలదు. కాని సంయుక్తరాష్ట్రముల తిరుగబాటు జరిగినపిమ్మట నేరస్థుల నచ్చటకుబంపుటకు స్థానములేకపోయెను. ఇంగ్లండులోని కారాగృహములలో స్థలము చాలుటలేదు. అమెరికా యధినివేశము

-లలో నున్న యాంగ్ల భక్తపరాయణులు స్వాతంత్ర్యము బ్రక-
టింపబడిన వెనుక మాతృదేశమునకు రాసాగిరి. వారికిగూడ
నూతన నివాసస్థలముల జూపవలసివచ్చెను. ఇన్నికారణముల
పైని యిష్టమున్నను లేకున్నను యాంగ్లేయు లాస్ట్రేలియాను వశ
పర్చుకొనుట తటస్థించెను.

18—1—1788 నాడు మొదటి యింగ్లీషుయోడ
బోటనీబే ప్రదేశమును జేరెను. ఆయోడపైని 1024 ప్రాణు-
లుగలవు. కొందరు స్త్రీలుగలరు. వీరందరిలో 717 గురు ఖయి-
దీలు మిగిలినవారు వారికి కాపరులు. కాని యీపటాలమున
కంతకును యధికారి యయిన ఫిలిప్పునకు యీబోటనీబేప్రదే-
శము నచ్చలేదు. కాని దానికి కొలదిదూరములో నున్న
సిడ్నీ ప్రదేశ మాతని నాకర్షించినది. అందుపైని వీరందరి
నివాసస్థానమచ్చటకు మార్పబడియెను. ఆసిడ్నీపట్టణమే నేడు
ఆస్ట్రేలియా కంతకును మహానగరమును, రాజధానియు నయి
విరాజిల్లుచున్నది.

ఆస్ట్రేలియాకు దక్షిణమున టాస్మేనియా యను ద్వీప-
ముగలదు. పరాసువారువచ్చి లోబరచుకొందురేమో యను
భయముచేత బోలెనను నాతడు టాస్మేనియాలో నొక చిన్నయ-
ధినివేశమును స్థాపించెను. క్రమముగా దానిసంఖ్యగూడ
పెరిగినది. టాస్మేనియాకు దక్షిణముగా న్యూజిలాండు ద్వీప-
ములుగలవు. న్యూజిలాండు దేశమంతయు పర్వతపంక్తులచే

నావరింపబడి హృద్యానందకరములగు వృక్షాదులచే శోభితమ
గుచుండును. ఈద్వీప మాస్ట్రేలియా కంటె యాకర్షణవంత
ముగ నుండినందున యొకేసారి చాల ప్రదేశములో యధినివే
శములు స్థాపింపబడియెను. 6-2-1840 సం॥ నాడు స్థానికజా
తులతో జేసుకొనిన యొడంబడిక ప్రకార మాంగ్లేయులున్యూ
జిలాండునకు నామమాత్రముగ రాజులుగనుండుటకును, భూమి
యు దానిహక్కును దేశీయుల యధీనములో నుండుటకును,
దేశీయులు తమ భూవసతి నమ్మకొనుటకు సంకల్పించినయె
డల ప్రథమమున యాంగ్లేయులకే యమ్మజూపుటకును నిర్ణ
యింపబడెను.

ఇంతవరకు నాస్ట్రేలియాలోను తదితర ద్వీపములలోను
యధినివేశములెట్లు స్థాపింపబడినవో మాత్రము గమనించి
యుంటిమి. కాని తత్ప్రాంతపు ప్రాచీననివాసులగురించి యేమి
యు పరిశీలించి యుండలేదు. ఆస్ట్రేలియాలోని యాదిమనివా
సులు బహు ప్రాచీనమైన మనుష్యజాతికి చెందినవారు. అడవు
లలో దిరుగుట, స్వేచ్ఛగా విహరించుట, వన్యమృగములజంపి
దినుటదక్క వారేమియు నెరుంగరు. ఆస్ట్రేలియాలోపౌరిజన
సంఖ్యకూడ చాలతక్కువ. అందుచేత దేశము సులభముగా
యాంగ్లేయుల వశమయినది. ఉచితముగ భూమిదొరుకుచు
న్నను ప్రజాభివృద్ధిలేని కారణముచేత యాస్ట్రేలియా యభివృ
ద్ధినిగాంచలేదు. ప్రభుత్వమువారి మన్ననన్ను, యిష్టమున్ననుతో

కున్నను జాన్ బేటుమెన్ మొదలగు కొందరు స్వాయముగా కొంతమైదానము నాక్రమించుకొని గొర్రెలను, మేకలను పెంచ సాగిరి. బేటుమెన్ ప్రవేసించిన ప్రదేశమున నేడు గొప్పదగు మెల్బోర్నను నగరమును గాననగును. ఈతడు దుప్పటులను, కత్తులను, కత్తెరలను, యద్దములనిచ్చి మాటుగా మూఢులగు దేశీయులనుండి సర్వహక్కులతో 600,000 యకరములభూమిని సంపాదించెను. కాని యాస్ట్రేలియాగవర్నరు 'బక్కు" యీసాధి యన్యాయమని ప్రకటించెను. యీప్రకటనకు గారణము చిన్న మొత్తములకు గొప్పమూల్యములు సంపాదింపబడినవనిగాదు. ఆస్ట్రేలియాలోని భూమియంతయు యాంగ్లసార్వభౌముని దగుటచేత నమ్మువారికి దానిలో హక్కులేదని యాతడు ప్రకటించెను. ఆహా యేమిన్యాయము? తాము ఖయిదీలను నసతి నేర్పరుచుట కచ్చటకేగియున్న మాత్రముచేత, చిరకాలము నుండి యక్కడబుట్టి, పెరిగి గిట్టు దేశీయులకు వెర్రిమూల్యము లకైన దానిని విక్రయించుటకు హక్కులేదట!

టాస్మేనియాలోని జాతిని "నల్లజాతి"యందురు. ఈజాతి మనుష్యసంతతి కంతకును ప్రాచీనమైనదని ప్రసిద్ధి. గవర్నరు ఆర్థరుగారు "నల్లజాతి"వానిని సజీవునిగా బంధించినచో 5 పౌను లుబహుమతి నిచ్చెదనని ప్రకటించెను. ఈధనముకొర కాస్ట్రే లియాలోనుండి పారిపోయిన ఖైదీలు మూఢదేశీయులను పెక్కు బాధలపెట్టసాగిరి. ఇదిగాక మాంసములో విషముగల్పి వారి

నివాసములదరిని బడవైచుటగలదు. దానినెరుంగక భుజించు టచే వారుచచ్చెడువారని, హెచ్. జి. వెల్సుగారు ప్రపంచ చరిత్రలో వ్రాసియున్నారు. 1830 వ సంవత్సరములో 5000 యాంగ్లేయులొక కట్టుగానేర్పడి వారినిముట్టడివైచిరిగాని, పొద లలో దాగుటయందును, యమ్ములవిడచుటయందును యప్ర తిమానమగు శక్తిగలిగిన యాకొద్దిమందియు వీరి నెట్లోతప్పిం చుకొని యడవులఁబట్టిరి. ఆంగ్లేయులందరుకలసి యొకదుంగ దాపున నిద్రించుచున్న యొకముసలివానిని, బాలుని మాత్ర ముబట్టగలిగిరి. తరువాత వారిసంభాషణను కొద్దిగానెరింగిన రాబిన్సన్ యనునాతఁడు వారితో చల్లనిమాటలనుజెప్పి 203 గుర నొకచో జేర్చి ప్లిండర్సు దీవిలో నివసింపజేసెను. కొంతకాల మునకు వారందరును గతించిరి. దొరకక దాగిన కొద్దిమందియు కాలమునకాహుతులయిరి. ప్రపంచకమునకంతకును ప్రాచీన మైన మనుష్యజాతికి జెందిన యాఖరుమనుష్యుఁడగు ట్రికానిని యనునాతఁడాంగ్లేయుల పుణ్యవశమున 1876 వ సంవత్సరమున గతించెను.

నూజిలాండు దేశీయులను మావురీలందురు. వీరికికొన్ని నాగరికతాచిహ్నములుగలవు. 1814 వ సంవత్సరముననే క్రైస్తవ మతబోధకులు కొందరచ్చటకుజేరి మతాంతరుల జేయుటకు ప్రయత్నములు జేసిరిగాని సఫలీకృతులుగాలేదు. కాని సముద్రతీరమున నివసించెడు మావురీ లాంగ్లేయులకు

ఖరీదుగల వస్తువులనిచ్చి మారుగా తుపాకులను సంపాదించి, మర్కటమునకు కత్తిదొరకినరీతిని తమ సోదరజాతులనే నశింప చేయసాగిరి. అందుచేత నాంగ్లేయులకు మంచియవకాశము దొరకెను. 1840 సం॥ లో పైనివ్రాసినటుల సంధిజరగెను. కాని 1843-46 లో భూమి తగాయిదావిషయమయి కొంత గడ బిడజరగెను. కానిగ్రేయునునాతను తాత్కాలికపు శాంతినొడ గూర్చెను. 1860 సం॥ లో తిరుగ యుద్ధము ప్రారంభమయ్యెను. యుద్ధకౌశలముగల యామావురీలు చాలతీవ్రముగా పోరాడి, తెల్లవారలను దమదేశముమండి వెడలగొట్టుటకు చాలప్రయత్న ములజేసిరి గాని 1865 సం॥ లో పరాజితులయిరి. కొంతమందిలొంగిరి. మిగిలినవారుత్తరప్రాంతములలో నివసింపనేగిరి. చాలకాలమువరకు వారు స్వేచ్ఛననుభవించి, తెల్లవారిని తమరాష్ట్రములో నడుగిడనియలేదు. నేడు 50,000 మావురీలుగలరు గాని వారి పూర్వపు భయంకర స్వభావముమాత్రము మారినది.

1850 వ సంవత్సరమునుండియు రెండుముఖ్యతరమైన కారణము లాస్ట్రేలియా చరిత్రను మార్పుజేసినవి. ఆవిరియంత్రములతో వోడలు ప్రయాణము చేయుచుండుటచేత దూరమందున్న యాదేశముదగ్గరగుట సంభవించెను. అన్నిటికిని మూలకారణ మాస్ట్రేలియాలో బంగారపుగనులు దొరకినది. దానితో వేలకొలది ప్రజలచ్చటకు మూగసాగిరి. దానితో జనాభా పెరుగసాగెను. ధనముహెచ్చెను. 1901 వ సం॥లో ఆస్ట్రేలియా ప్రజాస్వాతంత్ర్యము జేయబడియెను కాని యచ్చటకు నల్లజాతులకు ప్రవేశములేదు. దానినిగూర్చి ముందుదెలుసుకొందము.

శ్రీ

## ఏడవ అధ్యాయము.

### హిందూదేశము 2.

1857 సంవత్సరములో ననేక కారణములచేత సిపాయి విప్లవము తటస్థించినది. దానికి బిమ్మట రాజ్యాధికార మాంగ్లేయ రాజన్యుల హస్తగతమయ్యెను. 1858 సం॥ నాటికి తమయధికారముల ధిక్కరింపగలిగిన స్వదేశసంస్థలనన్నిటిని కంపెనీ వారణచివైచిరి. శిక్కులుగూడ యంతఃకలహములచే వారికిలొంగిపోయిరి. శౌర్యవంతులును, బలవంతులునగు గూర్ఖాలుమాత్రము బ్రిటీషు ఫిరంగులకు వెన్నుజూపని కారణముచేత నేపాలు దేశము మాత్రము స్వతంత్రమును నిలుపుకొనినది. ఈయఖండ సామ్రాజ్యము చేజిక్కిననాడు నాటి యాంగ్లదేశపాలకులగు శ్రీ విక్టోరియారాణి సార్వభౌమగు నొకప్రకటనను గావించెను. ఇండియాప్రజల సౌఖ్యమే తమసౌఖ్యమనియు, యందరను సమముగా జూచెదమనియు వారుప్రకటించిరి. కాని యిట్టి వాగ్దానములన్నియు సరస్వతీ ముఖముతో యయియున్నవి. కంపెనీనుండి పరిపాలనమారిన కారణముచేత దేశమున కెక్కుడుగా ప్రశంసింపవలసిన లాభమేమియుగలుగలేదు. 1861 సంవత్సరములో శాసనసభలు స్థాపింపబడియెను. కాని శాసనసభా సభ్యులలో నెక్కుడుమంది యధికారులును, మిగిలినవారు నియమితులు

నయియుండిరి. వారికి ప్రశ్నలడుగుటకుగాని, తీర్మానముల నుప
పాదించుటకుగాని హక్కులేదు. 1892 సంవత్సరములో కొం
దరెన్నిక సభ్యులకు స్థానమీయబడెను. వీరికి ప్రశ్నలడుగుట
కును, చర్చచేయుటకును హక్కులుగలవు గాని యార్థిక విష
యములపై దమ యసమ్మతి బ్రకటించుటకు వీలులేదు. ఈనా
మమాత్రశాసనము లన్నిటిచేతను దేశమునకు మాత్రము లాభ
మిసుమంతయు లేకుండెను.

19 వ శతాబ్దపు రెండవభాగములో హిందూదేశ ప్ర
భుత్వము రెండుముఖ్యయుద్ధములను జేసియుండెను. రష్యాదేశ
ము మధ్యయాసియాఖండమునంతనువశపర్చుకొనినట్లోడనే పిమ్మ
ట హిందూదేశమునుగూడ నదిజయించునని ప్రభువులు భయ
ముచెందిరి. అందుకొరకు ఉత్తర సరిహద్దుప్రాంతముననున్న
యాఫగనుదేశము నాంగ్లేయులు దమచెప్పుచేతల క్రిందనుండు
నటుల చేయుటకు బ్రయత్నించిరి. కాని యాఫగను నవాబు
వీరికి లొంగలేదు. ఈకారణముచేత 1878 సం॥ లో రెండవ
యాఫగను దండయాత్రను జరపిరి. అందువలన తాత్కాలికము
గావీరికాఫగను స్థానములో కొంతప్రతిపత్తిగలిగెను. 1885 సం
వత్సరములో మూడవ బర్మాయుద్ధము జరగినది. బర్మాదేశపు
రాజగు తీబా కొందరాంగ్లేయుల నవమానపరచెనను వంకమీ
దను పరాసువారొకవేళ బర్మాను దమకంటె ముందుగా జయిం
తురేమోయను మహాభయముచేతను యుద్ధము ప్రకటింప
బడెను. పిమ్మట రాజ్యము వశపర్చుకొనబడెను.

హిందూ దేశము, దేశములో జరగిన యుద్ధములలోనే గాక ఆంగ్లేయులు చేసిన యితరయుద్ధములకుగూడ తనసర్వస్వ మునర్పించెను. 19 వ శతాబ్దములో జరగిన యుద్ధములపట్టి కను జూడుడు.

పరదేశ యుద్ధములు

| | సాధారణఖర్చులు. | | ఎక్కువఖర్చులు. | |
|---|---|---|---|---|
| | ఇండియా | ఇంగ్లాండు | ఇండియా | ఇంగ్లాండు |
| మొదటిఆఫగన్ యుద్ధము 1832 | అంతయు | ఏమియు లేదు | అంతయు | లేదు |
| మొదటిచీనా యుద్ధము 1839 | ... | ... | లేదు | అంత |
| పర్షియాయుద్ధము 1856 | | ... | సగం | సగం |
| అబ్సీనియా 1867 (ఇది ఆఫ్రికాలోనిది) | ... | ... | లేదు | అంత |
| పీరకుదండయాత్ర 1875 | ... | ... | ... | ... |
| రెండవఆఫగన్ యుద్ధము 1878 | ... | ... | చాలా | కొంత |
| ఈజిప్టుయుద్ధము 1882 | అంతయు | లేదు | చాలా | కొంత |
| సౌదానుయుద్ధము 1885 | ... | | లేదు | అంతయు |

ఈయుద్ధము లన్నిటియందును న్యాయ ప్రకారము భారతీయ సైనికులుగాని, ధనముగాని యుపయోగింపబడవల సిన యవసరము లేదు. పైపట్టికనుబట్టి హిందూదేశము సైనిక

సహాయము నేగాక ధనసహాయమునుగూడ యమితముగా జేసి
యాంగ్ల సామ్రాజ్యమును పెంచిన సంగతి బాగుగా విశదమగు
ను. 1899 సం॥లో బోయరుయుద్ధము జరిగినపుడుగూడ భారత
పటాలములే ముందుగా పంపబడియెను. ఇంతమహాసహాయ
ముచేసినందులకు ఫలితములు దృగ్గోచరములగుచు నేయున్నవి.
సామ్రాజ్యగర్వముచే మురియుచు "తెల్లవానియాధిక్యత"యని
బలుకుచు నేడు దక్షిణాఫ్రికాలో భారతీయులకు మానవహ
క్కులుగూడ లేకుండ జేయుటయే మనకువచ్చినమహోపకారము.

పైజూపిన సహాయముయొక్క సరియయిన మూల్య
మాకాలములోని దేశపరిస్థితుల గాంచిన విదితమగును. హిం
దూదేశముయొక్క జనమును, ధనమును యాంగ్లసామ్రాజ్య
ముకొరకు పోరాడుచున్న కాలములో యీదేశము కరవుల
కాకరమైయుండెను. న్యూయార్కుపట్టణవాసులగు డాక్టరు
సండరులాండుగారి వాక్యములు యీవిషయములో పరికింప
దగినవి.

"19 వ శతాబ్దములో గతనలువది సంవత్సరములలో
(1860_1900 వరకు) హిందూదేశము సర్వసస్యనాశనకరము
లగు పదిగొప్పకరవులకు స్థానమై తత్కారణమున 15000000
జీవరాసుల గోల్పోయి యుండెను. ఈసంఖ్యలు ఘోరముగా
నున్నవి. ఇట్టిపరిస్థితులు ప్రపంచికి సానుభూతిని గాంచక
మానవు."

ఇట్టికరవులకు కారణమేమి యనుసమస్య ముఖ్యమయి నది. జనాభివృద్ధిచేతను వానలులేకపోవుటచేతను కరవులుగలిగి నవని యాంగ్లేయులలో కొందరు దీనినిసమర్థింపజూతురు. ప్రజా భివృద్ధి యెక్కువగుట యట్లుండ వృద్ధికావలసినదియు లేదని చెప్పుటకు జనాభా లెక్కలే తార్కాణము. ఇకవానలసంగతిని జూతము. మదాసురాజధానిలో గొప్పకరువువచ్చిన 1877 సం॥ లో 124 దుక్కులవానకురిసెను. 1900 సంవత్సర క్షామము నాడుపంజాబులో 36 దిక్కులును, మధ్యపరగణాలలో 104 ది క్కులునువానకురిసెను. (1 inch = 2దిక్కులుఅని లెక్కవేయ బడినది) కావున నిజమయిన కారణము లీరెండును గావని తేలి నది. హిందూదేశములో ముఖ్యాధారము వ్యవసాయము. అయిన నాంగ్లేయులకు బూర్వము దీనికనుగుణ్యముగా ప్రజలకు సహాయవృత్తులుండెడివి. అవన్నియు వీరిపరిపాలనలో నశించె ను. ఈవిషయములో ముఖ్యముగా లెక్కింపవలసినది బట్టల పరిశ్రమ. క్రీస్తునకు బూర్వము వేలకొలది సంవత్సరములనుండి యీ దేశములో నూలువడుకుట, బట్టలునేయుట ప్రజలెరింగి యుండిరి. స్వదేశమునకు తగినన్ని బట్టలను తయారుజేసుకొనుట యేగాక యితరదేశములకుగూడ బట్టలెగుమతి జేయబడుచుం డెను. రోమనుసామ్రాజ్యమునాటినుండియు భారతీయుల వస్త్రములకు మంచిప్రసిద్ధిగలదు. అట్టినేతపరిశ్రమను యొక యాంగ్లచరిత్రకారుడు వ్రాసినటుల "అన్యాయమగు రాజకీయ

ధికార శస్త్రముచే" నడచిరి. అందుచేత దేశములో నెన్న డెరుంగని బీదతనమును దుర్భిక్షమును ప్రాప్తించెను. దేశములో వేరువృత్తి కవకాశములేనందున యందరు వ్యవసాయముపై నాధారపడుట తటస్థించినది. దత్తుగారు వివరించినటుల రైలు మార్గములకు ఖర్చుపెట్టెడు దానిలో సగమయినను కాలువలు కొరకు ఖర్చుచేసినచో దేశమింతకన్న సుభిక్షముగా నుండెడిది. కావున దేశములోని దుస్థితి కాలమానపరిస్థితుల కారణము చేతగాక రాజకీయ పరిస్థితులచేతనే యిట్లున్నదని ఘంటాపధ ముగా పలుకవచ్చును.

రిపనుప్రభువు స్థానిక స్వపరిపాలనమును స్థాపించినను దేశమున కమితమయిన లాభము గలుగలేదు. ఇందుకు కార ణము దేశములోని యధికారమంతయు యింగ్లాండునుండి వచ్చు కలెక్టరుల చేతులలోనుండును. వీరికి పుష్కలములగు జీతములు లభించుటయేగాక, యుపకారవేతనముల విషయమయి వీరికి ప్రత్యేకహక్కులుగలవు. వీరందరును యధికారప్రియులు. భారతదేశమునకు స్వాతంత్ర్య మనవసరమనియును, యాంగ్లే యుల పరిపాలనయే లాభకరమనియును వీరిలో చాలమంది నమ్మకము. కొందరి కాంగ్లులు నాగరికతాధిక్యతగలవారగుట చేత వారలధికులని యభిప్రాయము. ఈ యభిప్రాయము ననుసరించి దేశములోని న్యాయచట్టములలో వారికి ప్రత్యేక సౌకర్యములు గలవు. జాతి మత వివక్షత మాపరిపాలనలో

యుండదను నీమహారాజ్ఞిగారు ప్రకటించినను, యాంగ్లేయులకు ప్రత్యేక న్యాయస్థానములలో విచారణకు హక్కుగలదు. మున్నటి చట్టములలో గూడ యీ విభేధము సంపూర్ణముగా తొలగింపబడి యుండలేదు.

ఇట్టి పరిపాలనలోని తప్పులను ప్రభుత్వమువారికి యెరుకపర్చుటకే ప్రథమమున దేశీయమహాజనసభ స్థాపింపబడెను. 1885 సంవత్సరములో బొంబాయిపట్టణములో దేశమందలి వివిధప్రాంతములనుండి వచ్చిన 72 ప్రతినిధులు సమావేశమయిరి. ఉమేశచంద్రబెనర్జీగా రధ్యక్షత వహించిరి. ఈప్రథమసమావేశమే నేటి జాతీయమహాసభకుతల్లి. దీనినుండియే సర్వశక్తి సమన్వితయగు జాతీయమహాసభ యుద్భవించి నేటివరకు తన ప్రభావమున విచ్ఛిన్నముగా ప్రకాశింపజేయుచున్నది. 19 వ శతాబ్దము ముగియుసరికే జాతీయభావములు ప్రఫుల్లితములయ్యెను. నూతన శతాబ్దములో మహాసభ యెట్టి యౌన్నత్యమునుగాంచెనో మున్ముందు బరికింతము.

శ్రీ

# సామ్రాజ్యతత్వము

## 8 వ అ ధ్యా య ము.

### ఆఫ్రికాఖండము.

ఆఫ్రికాఖండమును మొన్న మొన్నటివరకు "చీకటిఖండమ"ని పిలచెడువారు. ఆఫ్రికాఖండములోని కొన్ని ప్రాంతములనుదక్క యాదేశపు వైశాల్యమునంతను బూర్వులు పూర్తిగా నెరుంగరు. అందుకొఱకే దానికానామమును పాశ్చాత్యులు పెట్టియుండిరి. హిందూదేశచరిత్ర యెంతప్రాచీనమో, ఆఫ్రికాలోని యీజిప్టుచరిత్రగూడ యంతప్రాచీనము. సుమారు 7,8 వేల సంవత్సరములక్రితము యీజిప్టును పేహారాలు పరిపాలించుచుండిరి. వారి పరిపాలనోత్కృష్టతా చిహ్నములుగ నేడుగూడ కెయిరోపట్టణప్రాంతమున యత్యున్నతములగు ఫిరమిడ్సుయను గోరీలుగాననగును. వీటిలోనికెల్ల పెద్దది 750 అడుగుల చతురమును 450 అడుగులు యెత్తునుగలిగి 4,883000 టన్నుల బరువుండునని యంచనా వేయబడినది. ఇట్టి మహత్తరమైన శిల్పమును నిర్మించుటకు వారికాకాలములో నెట్టి శక్తి

యున్నదో యూహించుటకైన వీలుగాదు. ఈజిప్టుప్రజలే యూనాడు వ్రాతలిపిని గనుగొనిరి. ఒకవిధమయిన మొలకల నుండి కాగితముల దస్తరమును జేయుటయు వారెరింగియుండిరి. ఈమధ్య నలక్సారులో బయటకు దీయబడిన పెట్టెయు యమూల్యమైన వస్తువులను నాటి నాగరికతాప్రాశస్త్యమును దెల్పును. ఫేహరాల రాజ్యానంతరము గ్రీకులును రోమనులును కొంతకాల మాదేశమును పరిపాలించిరి. పిమ్మట ముసల్మానుల విజృంభణములో యీజిప్టును, యాఫ్రికా యుత్తరప్రాంతములును వారివశమయ్యెను. ఒక్క యీజిప్టునేగాక కొన్ని యుత్తరతీరప్రదేశములను రోమను లెరింగియుండిరి. రోమనుసామ్రాజ్యమును బ్రతిఘటించి యిటలీదేశమునుగూడ జయించిన కార్థేజి ఆఫ్రికాలోనిదే. ఈగొప్ప దండయాత్రను నడపిన కార్థేజి వీరుడు, హేనిబాలు ప్రపంచకవీరులలో పేరు బడసినవాడు. రోమనుసామ్రాజ్యము నశించినపుడు జర్మనుజాతులు కొన్ని యాఫ్రికా యుత్తరప్రాంతమును జయించెను. కాని చరిత్రలో యాఫ్రికాలోని యీదేశములు మహాప్రాముఖ్యతనువహించలేదు. 16 వ శతాబ్దములో నావికులు ప్రపంచయాత్రకై వెడలినప్పుడు ఆఫ్రికాపశ్చిమతీరములగాంచిరి. వాస్కోడిగామా దక్షిణాగ్రమును సమీపించెను. కాని పాశ్చాత్యులెవరును చాలకాలమువరకచ్చట యధినివేశముల స్థాపింపలేదు. కొందరు వర్తకులుమాత్రము పశ్చిమతీరములనుండి నీగ్రోలను

హింసించి, యోడలపైకొనిపోయి యమెరికాలో బానిసలక్రింద యమ్ముచుండిరి. పిమ్మటకొంతకాలమునకు బోయరులను డచ్చివారు దక్షిణప్రదేశములలో నివాసము లేర్పరచుకొనిరి. పిమ్మట కొంతకాలమున కాంగ్లేయులుగూడ యక్కడకు జేరనారంభించిరి. ప్రథమమున యక్కడనున్న దేశీయులగు కాపిరులతో గలభాలు యప్పుడప్పుడు జరుగుటగూడ గలదు. కాని వీరందరు నెమ్మదిగా యధిని వేశముల స్థాపించుకొనిరి.

ఇంతటితో యాఫ్రికాచరిత్ర పూర్తిజెందుట లేదు. నెపోలియనుయుద్ధములయనంతరము యూరపునకు శాంతిచేకూరెను. జనాభివృద్ధి మిక్కుటము గాజొచ్చెను. ఈ ప్రజలకు నూతన నివేశముల జూపవలసిన తరుణ మాసన్నమయ్యెను. 1840 సంవత్సరములో లివింగుస్టన్ యనునాతడు మధ్యయాఫ్రికా ఖండమునంతను పరిశోధించుటకు మొదలిడెను. ఈతడు తనజీవితమును యీయుద్యమమునకు ధారవోసి యాఫ్రికా నివాసయోగ్యమని ప్రపంచకమునకు నిరూపించెను. దానితో పాశ్చాత్యులకు యాశ మిక్కుటమాయెను. ప్రథమమున మతబోధకులు తయారగుదిరి. పిమ్మట యెవరకి జిక్కినది వారు దక్కించుకొనుటకు బ్రయత్నించిరి. బెల్జియమురాజు, లియపాలుడంతర్జాతీయసంఘము నేర్పరచి, క్రమముగా దానిని తనరాజ్యములో కలుపుకొనెను. కాంగోలో బెల్జియము పరిపాలన యతిదుష్టమయినది. దేశీయులను రబ్బరు మొదలగునవి

తయారుచేసి యియ్యనియడల నిర్బంధించి వారిని యష్టకష్టము లకు లోనుజేసిరి. 1881 సంవత్సరములో ఫ్రాన్సు టూనిసుప్రదేశమును దన రక్షణకిందకు దెచ్చుకొనియెను. పిమ్మట సహారా ప్రాంతములనన్నిటిని వశపర్చుకొనియెను. ఈజిప్టు ఖేదీవు పరిపాలనయందుంపబడెను. కాని యాజిని నిరంకుశపరిపాలన కష్టముగా నుండెను. ఆంగ్లేయులు ప్రథమమున నవాబునకు అప్పులు పెట్టసాగిరి. అరబీయనునాతడు జాతీయవాదులపక్షమున ఖేదీవుతో పోరాటము మొదలుపెట్టెను. దానితో యాతడు ఆంగ్లేయుల సహాయముకోరెను. వారు అరబీని యడచి వైచి యీజిప్టును నిశ్చితముగా తమ సంరక్షణక్రింద దెచ్చుకొనిరి. ఆఫ్రికాను పంచుకొనుటవిషయములో అమెరికాలోవలె యుద్ధము జరుగలేదు. కాని రాజనీతి నుపయోగించి సంధిపత్రముల వ్రాసుకొని పాశ్చాత్యులు వేర్వేరుప్రదేశములను బంచుకొనిరి. ఈరీతిగా నాంగ్లేయులకు యీజిప్టులో స్థానమిచ్చినందులకు, ఫ్రాన్సునకు మొరాకోదేశములో తనశక్తి నుపయోగించుకొనుటకు యనుమతీయబడియెను. 1882 సంవత్సరములో సుధానుప్రదేశము మహదియను నాయకునిక్రింద తిరుగబడెను. కిచనరునాయకుని యధికారముక్రింద యాదేశము లొంగెను. జర్మనులుగూడ పడమటితీరమునను, తూర్పుతీరమునను యధిని వేశముల స్థాపించుకొనిరి.

1877 సంవత్సరములో ట్రాన్సువాలుప్రదేశమును

యింగ్లండు లోబరచుకొనుటవలన బోయరులతో వైషమ్యము తటస్థించెను. దానితో యిరుజాతులకును మధ్య విభేదము పెరుగసాగెను. ఇంతలో 1886 సంవత్సరములో దక్షిణాఫ్రికాలో బంగారము గనులును, రత్నములు దొరుకసాగెను. కొద్దిరోజులలో యీపరిసరప్రాంతములలో జోహాన్సుబర్గుపట్టణముపూర్తియయిన యాంగ్లేయులజనాభాతో తయారయ్యెను. కాని బోయర్లకు యీనూతనసమాగమము కిట్టలేదు. ఈకాలములో కేపుపట్టణములో "రోడ్సు" యను ధనవంతుడుగలడు. అతడు గొప్పవర్తకుడు. ఆయనకు దక్షిణాఫ్రికా నంతను కబళించుటకు కోర్కెయుండెను. కావున తనతో నేకీభవించు కొందరు యాంగ్లేయులను తోడుజేసుకొని ఆంగ్లేయప్రభుత్వము సానుభూతిని సంపాదించి కొన్నిప్రాంతములను వశపర్చుకొనజొచ్చెను. దానిని రోడీషియాయని పిలుతురు. ఈసమకాలమున బోయరు రాజ్యమున కధ్యక్షుడు క్రూగరను నాతడు. ఆతడాంగ్లేయ ద్వేషి. స్వాతంత్ర్యప్రియుడు. బోయరుల యాధిక్యతను కోరువాడు. వారిహక్కులను నిలుపుటకు ప్రతినబట్టిన యాతడు. రోడ్సుయొక్క యీచర్యలన్నియు క్రూగరునకు కోపమును రగులజేసెను. ఈసమయములో బోయరు రాజ్యమును జయించుటకు జోహాన్సుబర్గు పట్టణమునకు సహాయమనువంక మీద రోడ్సు యొకపటాలమును బంపెను. ఆపటాలముక్రూగరునకు లొంగిపోయెను. దానితో విభేదము పూర్తియయ్యెను.

1899 సంవత్సరమున యిరుకక్షులకు యుద్ధము ప్రకటింపబడెను. ఘోరమగు పోరుప్రారంభమయ్యెను. ఆంగ్లసామ్రాజ్యమునుండియు, ముఖ్యముగా హిందూదేశమునుండియు చాలమంది సైనికులు పంపబడిరి. కాని చాలకాలమువరకు జయము బోయరులకు సంప్రాప్తించెను. ఆఖరునకు రాబర్ట్సు సేనాని ప్రయత్నములచే బోయరుల మారుయుద్ధము పరిసమాప్తిజెందెను. కాని బోయరులకు సమానహక్కులతో సంధియొనగూర్చబడియెను. దీనితో దక్షిణాఫ్రికా ప్రదేశమంతయు యాంగ్లేయుల వశమయ్యెను.

శ్రీ

# సామ్రాజ్యతత్వము

## 9 వ అధ్యాయము.

### ఇరువదవ శతాబ్దము.

ఇరువదవ శతాబ్దము సామ్రాజ్యచరిత్రలో చాలముఖ్యమయినది. నేడు దూరముగా నుండియున్న మాతృదేశములును యధినివేశములును పొగయోడలయొక్కయు, యితరసాధనములయొక్కయు సహాయముచేత దగ్గరగుచున్నవి. ఈశతాబ్దములో సామ్రాజ్యముల విస్తీర్ణము పూర్వపురీతిని పెరుగుటలేదు. గాని, సామ్రాజ్యవాసులలో గొంతమందికి బానిసత్వవిమోచనము గలుగలేదు.

ఈకాలములో ముఖ్యముగా గమనింపవలసిన విషయము శ్వేతేతరజాతులయొక్క మేల్కొలుపనియే నిక్కముగాచెప్పవచ్చును. మునుపటివలె నల్లజాతులు తెల్లవారలను దమకంటె యధికులనియు, వారే న్యాయపాలకులనియు నమ్ముటలేదు. నల్లజాతులలోను, పసుపుజాతులలోను కూడ జ్ఞానోదయము, సంఘీభావము వృద్ధిబొందినవి. ఇందుకు తార్కాణముగా మొట్టమొదట జపాను, చైనా చరిత్రలను గమనింతము.

1894 వ సంవత్సరమునాటికే జపాను ఘనతను సంపాదించెను. పాశ్చాత్య రాజ్యములవలెనే సేనను, నౌకలను, విద్యలను నాగరికతను పెంపొంద జేసుకొనియెను. ఎంత స్వాతంత్ర్యమును జూపినను జపానుమాత్రము పాశ్చాత్య భావదాస్యమునకులోనయ్యెను. ఇప్పుడు స్వతేజపరీక్షణా నిమగ్నమైయుండుట సంతోషావహము. పాశ్చాత్య నాగరికతతో బాటు జపానునకు సామ్రాజ్యతృష్ణ గూడలేకపోలేదు తనకు సమీపములోనున్న కొరియాపరిపాలన సరిగాలేదను మిషమీద జపానుకొరియాను జయించి యడ్డువచ్చిన చీనానుగూడ యోడించెను. ఇందువలన చీనాగూడ కొంతరాజ్యమును జపానునకీయవలసివచ్చెనుగాని జర్మనీ, యింగ్లాండు మొదలగు ఐరోపియను దేశములీసంధి యన్యాయమని తీర్మానించి జపానునకు నష్టపరిహార దేశమునీయకుండజేసిరి. దీనికికారణము యీసంధి చైనాస్వాతంత్ర్యమునకు భంగకరమగుటయేయని వారుచెప్పిరి. కాని 1897 సంవత్సరములో నైరోపియనులు చీనాలో తలయొకరేవు స్థలమునుచెపట్టిరి. నాడు పాశ్చాత్య నైజము వెల్లడియయ్యెను. దీనికి ఫలితముగా చైనాలో "బాక్సరుయుద్యమము" బయలుదేరెను. ప్రజలుచెలరేగి పాశ్చాత్యులను హత్యచేయసాగిరి. ఆఖరునకు శాంతి నెలకొల్పబడెను. కాని యింతలో రష్యా, మన్చూరియా ప్రదేశమును తనసంరక్షణ రాజ్యముగా పాలనజేసెనని చైనాను నిర్బంధింపసాగెను. కాని జపాను యంగీకరింపలేదు. అందు

మీద రష్యా, మూడువాయిదాలలో మన్చూరియాను ఖాళీచే యుటకు సమ్మతించెనుగాని క్రియలో యట్లుచేయుటకు బూను కొనలేదు. అందుపైన 1906 సంవత్సరములో జపాను, రష్యా దేశములు యుద్ధమునకుడీకొనెను. ఐరోపాకంతకును పెద్దదయిన రష్యా, జపానుముందర నిలువలేకపోయెను. జపానుప్రజ లతి తోత్సాహముతో సేనలోజేరసాగిరి. రష్యా నేలమీదను, సముద్రముమీదనుగూడ పరిపూర్ణముగా యోడిపోయెను. జపాను విజయము చాలముఖ్యమయినది. ఇంతవరకు నైరోపారాజ్యములు క్రమముగా చీనా పంచుకొనుటకు ప్రయత్నించుచుండినవి. కాని యిటుపైన యీపద్ధతి నీలులేకపోయినవి. పాశ్చాత్య పరాజయ మాశియాఖండములో నూతనోత్సాహమును, స్వసామర్థ్యపరిశీలనమును బెంపొందించెను. పాశ్చాత్యుల శక్తి యప్రతిహతముగాదని లోకమునకు వెల్లడియయ్యెను.

1908 సంవత్సరములో చీనాలో విప్లవము తటస్థించినపిదప 1912లో ప్రజాస్వామిక ప్రభుత్వము స్థాపింపబడియెను. కాని యింకను దేశపరిస్థితులు చక్కగాలేవు. జపానుమాత్రము నామమాత్రావశిష్టముగ లేదు. ఐరోపా సంగ్రామములో జపాను యుద్ధముచేయకపోయినను మిత్రమండలికి చాలసహాయము జేసెను. యుద్ధసమయములో పాశ్చాత్యవర్తకము సన్నగిలినప్పుడు జపాను చాలదేశములకు సరకులను సరఫరాజేసి వర్తకపరిస్థితులను హస్తగతము చేసుకొని చాలధనమును

సంపాదించెను. ఇకను జపానునకు సామ్రాజ్యతృష్ణపెరిగి కొరి యానును నిరంకుశముగా పరిపాలించుచున్నది. కాని కొరియాదే శస్థులు యుద్ధానంతరము స్వయనిర్ధారణ సూత్రమునుగ్రహించి స్వాతంత్ర్యసమరమును సాగించుచున్నారు. పిల్లలను బడులకు బంపుటమానిరి. దార్జన్యమును విసర్జించిరి ప్రభుత్వసహాయ మునువిరమించిరి. స్వాతంత్ర్యమును ప్రకటించిరి. అనేకకడంగండ్లు కోర్చి సర్వజనులును దేశము కొరకై పోరాడుచున్నారు. త్వరలో యభీష్టసిద్ధిని బడయగలరు. కాని జపానుస్వాతంత్ర్యశక్తియే చీనాను యితర ప్రాచ్యరాజ్యములను పాశ్చాత్యుల హస్తగ తము గాకుండ కాపాడినది.

మనము తిరుగ బ్రిటీషు సామ్రాజ్యము వైపునకు దృష్టి మరల్చుదము. ఈశతాబ్ద ప్రారంభముననే దక్షిణాఫ్రికాలో యింగ్లాండునకు చాలవిస్తీర్ణములగు ప్రదేశములు చేజిక్కినటు అయిదివరకే చదివియుంటిమి. కాని యిచ్చటపని చేయుటకు తగి నంతమంది కూలీలును కార్మికులును లేకపోయిరి. అందుకొరకు "వలసపద్ధతి" యుద్ధరింపబడెను. దీనిప్రకారము కూలీలను భారతదేశమునుండియు, యితరఆసియాదేశములనుండియు కం ట్రాక్టుపద్ధతిపైన పంపబడుదురు. ఆప్రదేశములలో ధనము దొరుకుననియు కుబేరులగుటకు వీళ్ళుగలవని యాశలగల్పించి బీదలగు కూలీలనచ్చటకు గొనిపోయి తోటలలో చాలగష్టపె ట్టెదరు. వారలకు సాధారణ మానవుల కుండవలసిన హక్కు

తైననులేవు. కష్టములకు తగినంత కూలిలేదు. ఎట్లో నిర్ణయ కాలము ముగిసినదనిపించుకొని స్వేచ్ఛగా నివసించుటకు మార్గములుగానరావు. ఆసియావాసులును, ముఖ్యముగా భారతీయులును ప్రత్యేకస్థలములలో నివసింపవలసియుండును. కొన్ని ప్రదేశములలో తలపన్ను నీయవలెను. నేరస్థులవలె వ్రేలిముద్రలను తీసుకొందురు. సరిచెడు మార్గములందును రైళ్లయందును వీరలకు ప్రత్యేకస్థలములుండవు. భారతీయులాదేశములో యాస్థులను సంపాదించుటకు వీలులేదు. ఇట్టిపరిస్థితులే ఫిజీద్వీపములలోను, సామ్రాజ్యములోని యితరప్రదేశములలో నుగలవు. ఆస్ట్రేలియాలో బ్రిటిషుభూమిచాలయున్నను భారతీయులనచ్చటకు పూర్ణమైన యాంగ్లభాషా పాండిత్యమున్నగాని రానీయరు. అప్పటికైనను మిగిలినవారితో సమానమైన హక్కులులేవు. కెనడాకు బోవలయునన్న హిందూదేశమునుండి ప్రత్యేకపు టోడపై దారిలో నెక్కడనాగకుండ వెళ్ళినగాని రానీయరు. అటులచేసినను "కొమగటామారు" యోడయొక్కయు దానిపైని తిన్నగా కెనడాకు ప్రయాణముచేసిన భారతీయులయొక్కయు నిరసనము మరువ వీలులేదు. ఒకేసామ్రాజ్యమునందు నివసించుచున్న భారతీయ పౌరుల కితరప్రదేశములో జరుగు మర్యాదలివియే. హిందూదేశమునందన్నను యొక్క యాంగ్లేయులేగాక పైరీతినిమనల నవమానించు యధినివేశములవారలకుగూడ దేశీయులకంటె భిన్నములును సౌకర్యములును

నగు ప్రత్యేకహక్కులు గలవు. గతశతాబ్దములో దక్షిణాఫ్రికాకేగి యచ్చటపరిస్థితులగాంచి యవమానింపబడి గాంధిమహాత్ముడు కష్టజీవుల సౌభాగ్యము కోరుచు, మాతృదేశగౌరవరక్షణముకొరకును వివిధవిధముల కృషిసల్పెను. ఎన్నివిధముల సహాయపడినను, పత్రికలలో పోరాడినను, ప్రార్థించినను దక్షిణాఫ్రికా ప్రభుత్వము లొంగకుండుటజూచి మహాత్ముడు 1913 సంవత్సరములో సత్యాగ్రహోద్యమ ముపక్రమించెను. వేలకొలది జైలుల కేగిరి. యనేకకష్టములకు పాల్పడిరి. అయినను దృఢమనస్కులై శత్రువులకు లొంగలేదు. హిందూదేశము భారతీయులకు యనేకవిధముల తోడ్పడెను. జనరలుస్మట్సు కత్తియుద్ధము లేకుండగనే యోడింపబడి భారతీయులకు కొన్ని కోరికల నెరవేర్చుటకు గాంధిమహాత్మునితో రాజీచేసుకొనెను. ఇంతలో మహాయుద్ధము వచ్చెను. మహాత్ముడు మాతృదేశోద్ధరణకై యిచ్చటకు వచ్చెను. కాని దక్షిణాఫ్రికా ప్రభుత్వము వాగ్దానముల చెల్లించుట యటుండ నేడుఆసియావాసులను ప్రత్యేకించుటకు ప్రయత్నించుచు మొన్న మొన్న భారతీయ ప్రభుత్వమువారు బంపినయడ్డు సవాళ్ళకైనను జవాబునిచ్చుటకు సమ్మతింపలేదు. ఇక కెన్యాసంగతి వేరుగా చెప్పనక్కరయే లేదు. కెన్యా తూర్పుఆఫ్రికాలోని యధినివేశము. అచ్చట 8000 తెల్లదొరలును వేలకొలది సంవత్సరములనుండి యచ్చటనుండి దేశసౌభాగ్యమునకు తోడ్పడిన 30000 భారతీయులును,

20 లక్షలదేశీయులును గలరు. కెన్యాపరిపాలనయంతయు ముఖ్యముగా తెల్లవారి యధీనములోనున్నది. ఎక్కడునున్న భారతీయులకు ఎన్నిక హక్కులు చాలలేవు. పీఠభూములలో నికి నల్లవారుపోరాదు. ఇట్టియన్యాయపుచర్య లాదేశములో జరుగుచుండెను. భారతీయులు న్యాయమైన హక్కులకొరకు పోరాడుటకొరకై ఆంగ్లదేశమునకు రాయభారుల నంపిరి. తెల్ల వారుకూడ తమప్రతినిధులనంపిరి. కాని పర్యవసానము మొన్న నేప్రకటింపబడెను. భారతీయులు కోరినహక్కులు నిరాకరింప బడెను. తెల్లవారలు జనసంఖ్యలో భారతీయులకంటె దక్కువ గాయున్నను వారలకు ప్రాతినిధ్యమెక్కువ. పీటభూములన్నియు తెల్లవారివే. ఇకపైని భారతీయులు విరివిగా యచ్చటకు వలస రాకూడదు. ఇవియే ముఖ్యసూత్రములు. కెన్యా సమస్యాపరి ష్కారమే భారతీయులకు యధినివేశములలోనున్న గౌరవము నిరూపించునని శాస్త్రిగారే వక్కాణించిరి. నేడేయీశాస్త్రి గారు యీపరిష్కారానంతరము భారతీయుల గౌరవము వినా శనమయినదని పల్కియున్నారు. అట్టిమెడ బ్రిటీషువారి న్యా యవిమర్శనయందు పరిపూర్ణనమ్మకముగలిగి ఆంగ్లమానస పుత్రుడైన శ్రీనివాసశాస్త్రిగారికే యీయూహ తట్టినపుడు యితర భారతీయుల యభిప్రాయమును గురించి వేరుగా వ్రా యనక్కరలేదు.

ఇరువదవ శతాబ్దప్రారంభమున హిందూదేశమునకు నిజ

పరిపాలకుఁడు కర్జనుప్రభువు. కర్జను యెంత సమర్థుడయినను, తన సామర్థ్యము నప్పు డేదేశములో వృద్ధిఁబొందుచున్న జాతీయోద్యమము నడచివైచుటకు వినియోగించెను. బెంగాలీల న్యాయశక్తిని ప్రశ్నించెను. ప్రజలకోరికకు వ్యతిరేకముగా బంగాళమును విభజించెను. దానితో జాతీయోద్యమము పెచ్చుపెరిగెను. దేశములోని నాయకులు బలువురు విదేశీబహిష్కారమును బోధింపసాగిరి. 1906 సంవత్సరములో కలకత్తాలో జరగిన దేశీయమహాజనసభలో స్వరాజ్యమంత్రమును భారతపితామహుఁడగు నౌరోజీ బోధించెను. కాంగ్రెసుకూడ స్వదేశీకొరకై తన యామోదమును దెలిపెను. దేశములో విప్లవోద్యమము బయలుదేరెను. గాని పలువురునాయకులు దానికి వ్యతిరేకముగా నుండిరి. కాని జాతీయవాదులు తిలకుమహారాజు నాయకత్వముక్రింద పరిపూర్ణ బహిష్కారమును కొనసాగింప నిచ్ఛగించి వందేమాతరధ్వనుల దేశములో మిన్నుముట్ట జేసిరి. అందువలన 1907 స॥లో సూరతులో జరగిన కాంగ్రెసులో గల్లంతుజరిగి అతివాద మితవాదపక్షములు విడిపోయిరి. తమదేశసేవాతత్పరతకై తిలకుమహారాజున కారుసంవత్సరములు కారాగారవాసమును, లజపతిరాయునకు దేశాంతరవాసమును లభించెను. తత్కాల శాంతికొరకును, మితవాదుల బుజ్జగించుట కొరకును, 1909 లోకొన్ని సంస్కరణము లీయబడెను. నిజాధికార విరహితులయిన మితవాదులప్రభ వెలుగజొచ్చెను.

యింకొకవింత జరిగెను. దేశములో నెన్నడో విప్లవోద్యమము గలదను వంకమీద తద్విచారణకై రౌలటుసంఘమును ప్రభుత్వమువారు నిర్మించిరి. అధికార పక్షపాతులగువారల సూచనల ప్రకారము కొన్నిచట్టములు చేయబడెను. వానివలన ప్రజలకుండు సామాన్యహక్కులు సన్నగిల్లెను. పోలీసువారికి హక్కులు యధికమయ్యెను. పునర్విచారణయు వాదమును లేకుండ వానివలన శిక్షలను విధింపవచ్చును. ఎంతమంది నాయకులు వలదని పోరాడినను యది శాసనమగుటజూచియే తద్శాసనమునకు సత్యాగ్రహోద్యమమును గాంధిమహాత్ముడు నెలకొల్పెను. దేశమంతయు యుత్సాహపూరితమయ్యెను. నిర్ణీతదినమున ప్రజలు హరతాళములజరపి యుపవసించి జాతీయభావముల వెలిబుచ్చిరి. ఈ విజయమంతయు ప్రభుత్వమున కేవగింపుగా నుండెను. ఈసమయమున పంజాబునకు మైకేలు ఒడయరు పరిపాలకుడు. ఆతడు తనరాజ్యములో నిట్టి విజయోత్సవముల గాంచి ఖిన్నుడై, విప్లవోద్యమము గలదనువంకమీద కిచులూ సత్యపాలు, చౌదరీ మొదలగు నాయకులను ప్రవాసముం యనవసరముగా రాష్ట్రములో సైనికశాసనమునులోపెట్టెను ఈ సైనికపరిపాలనను వర్ణించుట కొక్కగ్రంథము చాలదు కాని డయ్యరు జలియనువాలాబాగులోచేసిన వధయు, జా ను, బోస్వరుస్మిత్తులు ప్రజలను, విద్యార్థులను పెట్టిన ఘో వములును భారతీయు లెన్నటికిని మరువజాలరు. ఈవధల

యింకొకవింత జరిగెను. దేశములో నెన్నడో విప్లవోద్యమము గలదను వంకమీద తద్విచారణకై రౌలటుసంఘమును ప్రభుత్వమువారు నిర్మించిరి. అధికార పక్షపాతులగువారల సూచనల ప్రకారము కొన్నిచట్టములు చేయబడెను. వానివలన ప్రజలకుండు సామాన్యహక్కులు సన్నగిల్లెను. పోలీసువారికి హక్కులు యధికమయ్యెను. పునర్విచారణయు వాదమును లేకుండ వానివలన శిక్షలను విధింపవచ్చును. ఎంతమంది నాయకులు వలదని పోరాడినను యది శాసనమగుటజూచియే తద్శాసనమునకు సత్యాగ్రహోద్యమమును గాంధిమహాత్ముడు నెలకొల్పెను. దేశమంతయు యుత్సాహపూరితమయ్యెను. నిర్ణీతదినమున ప్రజలు హరతాళములజరపి యుపవసించి జాతీయభావముల వెలిబుచ్చిరి. ఈ విజయమంతయు ప్రభుత్వమున కేవగింపుగా నుండెను. ఈసమయమున పంజాబునకు మైకేలు ఒడయరు పరిపాలకుడు. ఆతడు తనరాజ్యములో నిట్టి విజయోత్సవముల గాంచి ఖిన్నుడై, విప్లవోద్యమము గలదనువంకమీద కిచులూ సత్యపాలు, చౌదరీ మొదలగు నాయకులను ప్రవాసము యనవసరముగా రాష్ట్రములో సైనికశాసనములలో పెట్టెను ఈ సైనికపరిపాలనను వర్ణించుట కొక్కగ్రంథము చాలదు కాని డయ్యరు జలియనువాలాబాగులో చేసిన వధయు, జా ను, బోస్వరుస్మిత్తులు ప్రజలను, విద్యార్థులను పెట్టిన ఘోర వములును భారతీయు లెన్నటికిని మరువజాలరు. ఈవధల

కారకులయినవారిని శిక్షింపలేదు. విచారణసంఘముల ఫలితములు ప్రభుత్వముపారి సూచనలు, పార్లమెంటులో డయ్యెరు సమర్థనము నిచ్చియున్నియు, బ్రిటీషు న్యాయమునందు విశ్వాసముగలవారినయినను నిస్పృహులజేసివైచెను. దీనికితోడుగా ఖిలాఫతు వ్యవహారమువచ్చెను. మహాయుద్ధములో ముసల్మానులు తమఖలీఫాకు వ్యతిరేకముగా పోట్లాడిరి. ఇందుకు ప్రతిఫలము తుర్కీస్వాతంత్ర్యమును బోగొట్టమని ప్రధానమంత్రి వాగ్దానమొనర్చెను. కాని సెవర్సుసంధిలో తుర్కీని నామమాత్రావశిష్టముజేసిరి. కొన్ని ప్రదేశములను మిత్రమండలివారు సంరక్షణరాజ్యములుగాబంచుకొనిరి. కాన్‌స్టాంటినోపిలు నగరముమాత్రము తుర్కీసుల్తానును, ప్రపంచకములోని ముసల్మానుల సంరక్షకుడగు ఖలీఫాను మిత్రమండలి సైనికపరివేష్టితమై మిగిలియుండెను. తమమతపీఠమునకు భంగము కలుగుట జూచి ముసల్మానులును, వారికిసహాయముగా హిందువులును యాందోళనచేసి రాయబారములనంపినను లాభములేకపోయెను. దానిపై మహాత్ముడు అసహాయోద్యమమును, పంజాబు ఖిలాఫతు వ్యవహార నిర్ణయములకును, స్వరాజ్య సంపాదనకొరకును బ్రయోగించెను. సార్వజన్యవిస్తీర్ణము, మహోద్వేగస్ఫూర్తమైన యీ యుద్యమము భారతీయులనందరను ఏకముఖమునకు దెచ్చెను. కొందరు న్యాయవాదులు వృత్తులు విసర్జించిరి. విద్యార్థులు భావదాస్యప్రబోధకములగు యాంగ్లకళాశాలల బహిష్కా

శించిరి. విదేశవస్త్రములు యగ్నికాహుతి జేయబడియెను. రాట్నప్రచారము విశేషముగాజరిగి నడుమనూలే దేశములో వస్త్రముల కుపయోగింపబడసాగెను. పలువురునాయకులు సుమారు 25000 మంది ప్రభుత్వమును దాని యన్యాయచర్యలను దిరస్కరించి కారాగారముల కేగిరి. ప్రపంచకములో మహోత్కృష్ట పురుషుడని పొగడ్తగాంచిన మహాత్ముడుగూడ కారాగారమున ఆరువత్సరములశిక్ష ననుభవించుచున్నాడు. కాని యేతదుద్యమము సాగుచునే యున్నది. ఈమహోద్యము తత్వమే పాశ్చాత్యపరాజయమునకు మార్గము జూపగలదని మానమ్మకము. గావున దానితత్వము నాఖరున విపులపరచెదము.

గతయధ్యాయములో నీజిప్టు యాంగ్లేయులవశమయ్యెనని వివరించితిమి. ఈజిప్టులోగూడ నేడు స్వాతంత్ర్యసమరము జయప్రదముగా జరుగుచున్నది. ఈజిప్టుదేశ మతిప్రాచీనమయినది. తాత్కాలికపు ఆంగ్లేయుల పాలనదేశమందు శాంతినొడగూర్చినను, స్థిరముగా వారచ్చట పాదుకొనియుండుట ప్రజలకు నచ్చలేదు. ఈజిప్టునకొక శాసనసభ నేర్పాటుజేసిరిగాని, దాని సభ్యులందరు జాతీయవాదులగుటచేతగాబోలు ఐరోపాసంగ్రామప్రారంభమున దీని నడచివైచిరి. యుద్ధకాలములో ప్రజల నతిఘోరముగా శాసింపనారంభించిరి. పలువురను బలవంతము గా సైనికులుగా దయారుచేసిరి. పత్రికలను ప్రజాభిప్రాయము

నడగదొక్కిరి. కాని ప్రజల యుత్సాహముతగ్గలేదు. మంత్రి వర్గమువారు రాజీనామానిచ్చిరి. ప్యారిసులో జరుగు సంధిసభకు తమ ప్రతినిధులపంపుటకు యత్నించిరి. వారికి యడ్డంకులు కల్పింపబడెను. ఆఖరునకు వారు ప్యారిసుపట్టణమునకు వెళ్ళగా వారికెవ్వరును దర్శనమీయలేదు. పైగా యీజిప్టు ప్రభుత్వము రాయభారులు ప్రజాప్రతినిధులు గారని బ్రకటించెను. అందుకొరకై దేశములోని బ్రజలవద్దనుండి సంతకములు తీసుకొనుచుండగా, ప్రభుత్వమువారు దానిని నిషేధించిరి. ఆ ప్రకటన వచ్చుసరికే వారు 20 లక్షల సంతకముల సంపాదించియుండిరి. యుద్ధము ముగిసినతరువాతగూడ దమకు స్వాతంత్ర్యము రాకుండుటజూచి వారలకు దృఢప్రతిజ్ఞ యెక్కువాయెను. కావున 1919 లో సంస్కారణముల నిచ్చెదమనివచ్చిన మిల్నరుసంఘమువారు బహిష్కరింపగలిగిరి. ప్రభుత్వోద్యోగియులుసంఘము దరిచేరలేదు. విద్యార్థులు బహిష్కారమును బోధించుట కుత్సవములు జేయసాగిరి. మంత్రులకు యితరయుద్యోగియులకు కాపలా గాయుచుండిరి. స్త్రీలు యుత్సవములుచేసియు, ట్రాంబండ్లపై కెక్కి పట్టణమంతను తిరుగాడుచు జాతీయతను బోధింపసాగిరి. పదేండ్ల బాలికలుగూడ యీ యుద్యమములో పాల్గొనియుండుటజూడ వారి భావోద్రేకము వెల్లడికాగలదు. మిల్నరుప్రభువునకు దేశీయుల దృఢప్రతిజ్ఞయు, జాతీయతాశక్తియు వెల్లడియయ్యెను. ఎంతకాలము వేచి

యున్నను తమ్మెవరు గాంచకుండుటజూచి మిల్నరుసంఘము గృహోన్ముఖమయ్యెను. అచ్చట వారు కొన్ని ముఖ్యమయిన సంహాలనిచ్చిరిగాని బ్రిటీషు మంత్రివర్గమువారు వానికి సమ్మతింపలేదు. పైగా దేశీయనాయకులగు జగులుకపాషాను నిర్బంధములోనుంచి ప్రవాసమంపిరి. కొన్ని నెలలక్రిందట యాయనను విడుదలజేసిరిగాని స్వదేశమునకు వెడలుట కనుజ్ఞనీయరైరి. దానితో యీజిప్టులోని యుద్యమమంతరింపలేదు. దేశప్రజలు స్వాతంత్ర్యోన్ముఖులై మహత్తరమైనకృషి సల్పుచున్నారు.

అయిరోపా మహాసంగ్రామము ముగిసినతరువాత తుర్కీసుల్తాను సామ్రాజ్యములోని మేలుభాగములు నిజపాలకుని హస్తచ్యుతినిగాంచినవి. సెవర్సుసంధి యనంతరము అరేబియా ప్రత్యేకరాజ్యముగా జేయబడెను. గాని దానిపాలకుడు నిజములో బ్రిటీషు సంరక్షణక్రిందయున్నాడు. మెసపొటోమియాను ఆంగ్లులును, సిరియాను ఫరాసులును, అనటోలియాలునుయిటాలియనులును హస్తగతముజేసుకొనిరి. అవిపేరిసంరక్షణక్రిందనుండును. తుర్కీసుల్తాను నిజాధికారరహితుడగు బొమ్మవలెనుండవలెను. కానిసంధి తురుష్కుల కిష్టముగాలేకుండెను. కొలదికాలములోనే తురుష్కులు మహాశక్తివంతుడును ప్రతిభాశాలియనగు కెమలుపాషాక్రింద విజృంభించి అంగోరాలో నూతన ప్రభుత్వమును స్థాపించుకొనిరి. క్రమముగా వారిశక్తి సంపాదించుకొనిరి. హిందూదేశములోని మహమ్మదీయులును హిం

మిత్రులును గూడ వారికి ధనసహాయమును జేసిరి. వారుతమకు గృహశత్రువులును ఆంగ్లులవలన ధన, జనసహాయములును రహస్యముగా పొందుచున్నవారునగు గ్రీకులనోడించివైచిరి. తమ్మెదిరించుచో మిత్రమండలివారితోనైన డీకొనుటకు జంకరైరి. ఇంక చేయునది లేక మిత్రమండలివారు లాసేనులో సంధి మాటలనుపక్రమించిరి. తురుష్కులు కబురులకు లొంగలేదు. వారిసంధిషరతులలో నిజాధికారమును చాలవరకుబొందిరి పూర్ణమయినసంధి 24-7-23 నాడే చేసుకొనబడెను. ఈతురుష్కవిజయము ఆశియాయొక్కయు, భారతదేశముయొక్కయు నిగూఢశక్తులను బ్రచురించుచున్నది. ఈవిజయము ప్రపంచకములోని పాశ్చాత్య సామ్రాజ్యపాలనాప్రభకు వజ్రాయుధమయినదని వ్రాయవచ్చునను యూహను గొప్పగొప్ప పత్రికలు వెలిబుచ్చుచున్నవి.

ఇంగ్లాండున కధినివేశమయిన యమెరికాసంయుక్తరాష్ట్రదేశము నేడు దానికంటెను మహత్తరమయియున్నది. ఇదిగాక అమెరికాప్రజాస్వాతంత్ర్యరాజ్యము విద్యావిధానమునందును, ధనమునందును యమెరికా మిన్నయనవచ్చును. ఈయమెరికాలోగూడ రంగు భేధముండుట చాలవిచారకరము. ఇదివరకు వ్రాసినట్లుల నీగ్రోలను యమెరికాలో కూలిపనిచేయుటకు బానిసలక్రింద తీసుకొనిపోయిరి. అనేకసంవత్సరములు వర్ణింపనలవిగాని ఘోరకష్టములకు లోనైన నీగ్రోలకు 1865వ

సంవత్సరములో స్వేఛ చేకూరెను. నీగ్రోలు నేడు మూఢులు గారు. వారిలో ఒకరు వాషింగుటనువంటి మేధావులు గలుగు చున్నారు. కానివారింకను పల్లెలలో వ్యవసాయము చేసుకొను చుందురు. ఈదీనులను వంచించుట కచ్చట తెల్లదొరలెంతెంత క్రూరములగయిన జేయుటకు జంకుటలేదు. ఎన్నికలలో వోట్ల నిచ్చు నీగ్రోలను బెదరింతురు. క్లూక్లుక్సుసంఘమువారు దమ యన్యాయప్రవృత్తులకు లొంగని నీగ్రోలను వధించుటకుగూడ జంకరు. ఇంతియేగాక యమెరికాలో "లించింగు" యను క్రూర పద్ధతిగలదు. తెల్లప్రజామూకముచెలరేగి న్యాయస్థానమునందు విచారణ జరుగుచున్న నీగ్రోనిందితుని విచారణ ముగియక మునుపే బహిరంగముగ చిత్రవధజేసెదరు. ఇట్టిచర్యలు యీ శతాబ్దములో వేయికిపైగ జరిగినవి. ఇట్టిచర్యలు యమెరికాకు కళంకమును గలిగించుచున్నవి. ఇప్పుడన్ననో నీగ్రోసంఘములు బయలుదేరినవి. వారు స్వరక్షణకు గడంగుచున్నారు. అమె రికాలో విద్యాధికులగు నీగ్రోలు స్వదేశమగుయాఫ్రికాలోని దీనసహోదరుల నుద్ధరించుటకుగూడ యత్నించుచున్నారు.

అమెరికాకు పెద్దసామ్రాజ్యము లేదుగాని కొన్నిద్వీప ములుమాత్రముగలవు. వాటిలో ముఖ్యమయినవి శాంతమహా సముద్రము మధ్యనున్న ఫిలిప్పైనుదీవులు. జపాను విజృంభించిన చో తమకు నష్టము గలుగగలదను యూహచేవారు ప్రథమ మునవాటిని స్వాధీనపరచుకొని కొంతయుపకారములచ్చటి

ప్రజలకు జేసిరిగాని 1916 సం॥లో తాముప్రకటించినటులస్వాతం త్ర్యమునీయలేదు. అక్కడగూడ జాతీయోద్యమ మెక్కుడుగా నున్నది. 3-3-21 తేదీని అమెరికా సెనేటుసభలోనుపన్యసించుచు దీవులకమీషనరగు గోబాల్డనుగా రిటులుపన్యసించియుండిరి.

"ఫిలిప్పైనుదీవులలో యమెరికావారికార్యభారము ముగిసినది. మీరుతలపెట్టిన ధర్మకార్యము సార్థకమయ్యెను. మేము ప్రాణప్రదముగా పూజించుచుండిన స్వాతంత్ర్యము నిచ్చెదమని శపథము జేసితిరి. స్వాతంత్ర్యసంపాదనమే మాపరమార్థము. ఆపరమార్థముకొరకే మాయత్నములన్నియు జరుగుచున్నవి. జాతీయభావ మెవరియందును యంతరింపదు. దానిని తుంచి వేయుట కెవరికిని సాధ్యముగాదు. కాలచక్రము తిరిగినకొలది యీవాంఛ యతిక్రమించి బోవుచుండును. మేము యమెరికా వారి దయాదాక్షిణ్యములనునమ్ముకొనియున్నంతకాలము మహావీర్యవంతమగుజాతివారము గాజాలము. ఇతరులవలె మేము ను తలయెత్తుకొని గౌరవముగా తిరుగవలెనన్న కాలానుగుణ్యమైన కష్టనిష్ఠురములను సహించుకొని వికసింపవలసినవారము గావలయును."

గోబాల్డనుగారి వాక్యములు వారిదేశస్థుల భావానువృత్తిని దెలుపుచున్నవి. జపానువారివలని భయముచేత ఫిలిప్పైనుదీవులకు స్వేచ్ఛనీయకుండుట పాడిగాదు. ఒక్కయమెరికా వారికేగాక యితర తెల్లజాతులవారికందరకును యీనల్ల పచ్చ

జాతులన్నియు కంటకములుగా గాన్పించుచున్నవి. చీనాదేశీయు లును, భారతీయులును తక్కువకూలికి యెక్కువపనిచేయుదు రనుచో వారికి ప్రోత్సాహము గల్పింపవలయునుగాని వారిని బహిష్కరించి బాధించుట న్యాయముగానేరదు. అధినివేశము లలోనేమి మాతృదేశములలోనేమి భారతీయులకు సమాన హక్కులులేవు. ఈమధ్య యమెరికాన్యాయస్థానములుగూడ యిట్టితీర్పులజేసియుండెను. తెల్లవారికంటె శ్వేతేతరజాతుల సంఖ్య ప్రపంచకములో నెప్పుడు యెక్కువగానుండగలదు. ఇరువదవ శతాబ్దము గతించుచున్నకొలది తెల్లవారి నిరంకుశ పరిపాలన యప్రతిహతముగా కొనసాగుటలేదు. ప్రపంచకమం దన్ని దీనజాతులయందును వికాసము కలిగినది. నీగ్రోలును భారతీయులును యితరులును తెల్లవారి మర్మతంత్రములలో బడుటలేదు. అమెరికా భయముచేత నేడు జపాను "యాపు" ద్వీపమును వదలుకొనుటకు పూనుటలేదు. ప్రతిచోటను జాతి యధ్వజములు లేచినవి. జాతీయత వెల్లివిరియబారుచున్నది. కాని వీరెల్లరు నైజికస్వేచ్ఛను గాంచుటకు యుద్ధము లెంత మాత్రము మార్గములుగావు. మారణహోమములు పరిపాల కుల యాయుధములుగానేయుండుట మనకులాభము. స్వాతం త్ర్యమార్గము మహాత్ముడుబోధించు సత్యాగ్రహమేగాని వే రొండుగాదు. దానిననుసరించి ద్వేషవిరహితులయి కృషిసల్పు చోయన్నియధీనజాతులును త్వరలో ముక్తిగాంచగలవు.

శ్రీ

# సామ్రాజ్యతత్త్వము.

## 10 వ అధ్యాయము.

### పాశ్చాత్య పరిపాలనము.

ఇంతవరకును పాశ్చాత్యులు సామ్రాజ్యసంపాదన మెట్లుచేసితిరో గమనించియుంటిమి. ఇప్పుడు వారి పరిపాలనా పద్ధతులను గమనించుట యుక్తము. 16 వ శతాబ్దములోని పోర్చుగీసు డచ్చివారల సామ్రాజ్య ప్రయత్నములు వర్తకసంబంధమయినవి. 17, 18 శతాబ్దములలోని ఆంగ్ల, ఫ్రాంసు సామ్రాజ్యములుగూడ యట్టివేయని యనవచ్చును. పాశ్చాత్యులు సంపాదించిన రాజ్యములు రెండురకములు. అనాగరికప్రదేశములు. నాగరికప్రదేశములు. అనాగరిక ప్రదేశములలో నీల గుచోట్ల యాదిమనివాసులను మటుమాయము జేసి సామ్రాజ్యములు స్థాపించుటయినది. దీనికి యాస్ట్రేలియా తార్కాణము. ఇక రెండవరకములో భారతదేశమును గమనింపవలెను. ఇచ్చట పాశ్చాత్యుల కేవిధంబునను దీసిపోవని నాగరికత గలదు. అందుకొరకు వారు వేర్వేరు మార్గముల గమనింపవలసివచ్చెను. సామ్రాజ్యముల నెందుకు సంపాదింపవలయునన్న విషయము

నకు పాశ్చాత్యులేమి జవాబా సంగతిలో ముందర గమనింతము. మాతృదేశముయొక్క రాజ్యవిస్తీర్ణమును పెంచుట ప్రీతిపారుని యొక్క ధర్మము. రాజ్యస్థాపనచేసిన కారణముచేత ఫోర్జరీచేసిన రాబర్టుక్లైవుగారు వీరవతంసులయిరి. రెండవవాదము స్థానికప్రజలకు నాగరికత మప్పవలయుననియు, పాశ్చాత్యుల సామ్రాజ్య నిర్వహణము మానవ కళ్యాణముకొరకేయని చెప్పుటయునయియున్నవి. దీనినే క్లిప్లింగుగారు "తెల్లవానిబరువ"ని చెప్పియుండిరి. అచ్చటిప్రజల కిష్టమున్నను లేకున్నను మానవ కళ్యాణముకొరకైనను వారి నితరులవలె దయారుచేసి పాశ్చాత్య విజ్ఞానమునే పెంపొందజేసి ప్రపంచకములో నెచ్చటను యనాగరికత లేకుండజేయుట తెల్లవారి సత్యసిద్ధమైనహక్కు. ఇంకొక వాదము సామ్రాజ్యమునందుట సామ్రాజ్యాంతర్గత దేశములన్యోన్య సహాయముచే పరిపూర్ణ స్వేఛనందుటకే యనుట. ఈవాదమునుమనదేశములో నిమిత వాదులు నమ్ముదురు. కెన్యా పరిష్కారములో వీరుకొంచెము కండ్లు తెరచిరి. ఈవాదన నైజమును పాణీకరుగారు తమగ్రంధములో వ్రాసిన యీసంగతులు దెలుపును. "అధీనప్రజలకు సంబంధించినంతవరకు బ్రిటీషు ప్రభుత్వము ప్రజాప్రాతినిధ్య పరిపాలనకై నడచుట లేదు. ఆప్రభుత్వము నిజముగా నల్లజాతులను పీల్చిపిప్పిచేయుచున్న తెల్లజమీందారులవర్గము. దానిని నిజముగా "బ్రిటీషు సామ్రాజ్యవర్తక కంపెనీ లిమిటెడు" యనవలయును. అదియు సామ్రా

న్యవర్తక సంఘములవలెనే ప్రభుత్వ భాగస్వాములకు యత్యా
ధికలాభమును పంచియిచ్చుటయందే గృషిసల్పుచున్నది.

ఐరోపియనులకు ప్రపంచకము నావరించుకొనుటలో
రెండువిషయములు బురికొల్పినవి. మొదటిది యార్థికవిషయ
ము. రెండవది సైనికవిషయము. తమదేశములో యంత్రయుగ
ము వచ్చినతరువాత, వస్తునిర్మాణముకొరకు పరికరములనిచ్చు
టకును, తయారయినవి కొనుటకును ప్రదేశములు కావలసివ
చ్చెను. ఆదేశములు లేనిచో పాశ్చాత్యదేశములో ప్రజలకు జీవ
నాధారమే లేదు. కావున వేర్వేరుదేశములవారు యాఫ్రికాలో
ను, ఇండియాలోను, ఆశియాలోను ప్రదేశములను సంపాదింప
సాగిరి. పిమ్మట వర్తకమును గాపాడుకొనుటకయి వర్తకప్ర
దేశములను సంపాదింపవలసివచ్చెను. అందుకొరకు జిబ్రాల్టరు,
మూాపుదీవి మొదలగునవి యాశింపబడియెను. పిమ్మటసంపాదించిన
ప్రదేశముల కాపాడుటకయి సరిహద్దుదేశముల జయింపవలసి
వచ్చెను. యీజిప్టుసంపాదింపక పోయినచో హిందూదేశము
తో వర్తకముగష్టము. అది శత్రువుల యధీనములో నుండరా
దు. ఇటులనే బంగాళముకొరకు అయోధ్యను, దానికొరకు
పంజాబును, యింగ్లీషువారు జయించిరట. నేడుపంజాబుకొరకు
ఆఫగనిస్థానములోను, దానిపైన పరిష్యాలోను యాంగ్లేయుల
యత్నములు ప్రత్యక్షములే. ఇంకొక ముఖ్యమయినలాభము
యొకదేశము జయించినచో యాదేశప్రజల సహాయముతో యి

తరదేశముల వశపర్చుకొనవచ్చును. ఈవిషయములో హిందూ దేశమెట్టుల వినియోగింపబడెనో మనకువిదితమే. ఈచర్యయంతయు యొక కథలాగుననున్నది. ఒక సన్యాసి గోచీని యెలుకలు కొట్టుటచే యొకపిల్లిని సంపాదించెను. దానికి పాలకొరకు యావును, దానికి మేతకై పొలమును, దానిలో పండుధాన్యమును వినియోగించుటకు భార్యను సంపాదించెను. దానితో సన్యాసి మిగిలిపోయి మోక్షము దూరమయినది.

ఇకవీరు యవలంభించిన పద్ధతులను గమనింతము. సైనికబలములేని ఆల్జియర్సును, తమరాయభారిని దూషించిరను కారణముచే పరాసులుగలుపుకొనిరి. మతబోధకుని జంపిరను వంకపై జర్మనీ చైనానుండి మంచిరేవుపట్టణమును సంపాదించెను. లేనిచో దేశపరిపాలకులకు దుర్వ్యయమునుమప్పి, యప్పులు పెట్టి రాజ్యములబొందిరి. ఈవిధమున ఈజిప్టును ఆంగ్లేయులును, మొరాకోను పరాసులును గలుపుకొనిరి. కొన్నిరాజ్యములలో యశాంతియున్నదను వంకజెప్పి వాటిని కలుపుగొనుట తటస్థించినది. ఈరీతిన యోధ్నానాంగ్లులును, కొరియాను జపానీయులును వశపర్చుకొనిరి. దేశీయుల యనుమతిలేకనే తమలోదాము పేర్వేరురాజ్యములలో ప్రవేశము గలిగించుకొనుటకై పాశ్చాత్యులు పంచుకొనజూచుటయొక మార్గము. ఈరీతిని ఆంగ్లులు యీజిప్టును, పరాసులు మొరాకోను, సైప్రసు ఆగ్లేయులకును, ట్యూనిసు పరాసులకు

ను, యుద్ధానంతరము యింగ్లాండు మెసపొటోమియాను, పాలస్తీనాను, యిటలీ యనటోలియాను, సిలీసియాలను బంచుకొనెను. అనాగరికప్రజలకు వింతవస్తువులు, తుపాకులునిచ్చి పెద్దవిస్తీర్ణముల సంపాదించుట మరియొకమార్గము. ఈరీతిని యాఫ్రికాలోను, న్యూజిలాండులోను ప్రయత్నింపబడియెను. ఇవన్నియు పాశ్చాత్యరాజ్యనీతి ప్రభావమును దెలుపును.

వీరి పరిపాలనవలన సామ్రాజ్యమునకేమయినా లాభములు గలవాయని విమర్శించినచో అనాగరికప్రజలకుకూడ లాభము చేకూరినటుల గాన్పించదు. సాధారణముగా వలసకుబోయెడు ఐరోపియనులు గొప్పకుటుంబికులు గానేరరు. అందుచేత వారి సంపర్కమువలన పాలితులకుగొప్పసాంఘికలాభములు చేకూరలేదు. తూర్పుయిండియా వర్తకసంఘమువారి గుమాస్తాలగు యువకులెట్టిచర్యలు జేసెడివారో ముందొక యధ్యాయములో వర్ణించితిమి. కాని అనాగరికప్రదేశములలో వీరివలన సంఘ కట్టుబాట్లుబోయి, త్రాగుడు వ్యభిచారము హెచ్చెను. హిందూదేశము మొదలగు నాగరికప్రదేశములలో మొదటి సంఘము కొంతలొంగినను తిరిగి స్వనిరీక్షణతో పూటుబడి స్వజాత్యుద్ధరణకు బూనుకొన్నది.

ఇంకపరిపాలనాపద్ధతులనువిమర్శింతము. శివిలుశాఖాపరిపాలనాపద్ధతి ముఖ్యమయినది. ఇంగ్లండులో ఐ. సి. యస్. ప్యాసయిన యువకులనే యెక్కుడుగా యున్నతోద్యోగములలో నుం

చుట. వీరిలో కలెక్టరులు ముఖ్యమయినవారు. వారితోడనే సామ్రాజ్యము నిలచియున్నదని వారందరు వాదింతురు. వారి చ్చుటకు వచ్చుసరికే కొంత తమసాంఘికాధిక్యత గలదని నమ్ము దురు. కావున దేశీయులనిన వారలకు గౌరవము దక్కదు. వారి యధికారము చలాయించుచుండుటకు కొన్ని సహకారపద్ధతులు గలవు. మొదటిది దేశములో నంతఃకలహములు పెంచుట. చిన్నికలతలను వేయిమడుంగులు వృద్ధిజేసి ద్వేషానలము రగు ల్కొల్పుట. ఈరీతిని హిందూముసల్మానులకును, ఈజిప్టులో ముసల్మానులకును, కాప్టులకును, సింహళములో తమిళములకు ను, సింహళీయులకును వైషమ్యము ప్రోత్సహింపబడియెను. రెండవది గౌరవముల లంచముపద్ధతి. ఏవో కొన్ని బిరుదులను కితాబులను తగిలించి ప్రతికక్షులను తమవైపునకు త్రిప్పుకొం దురు. దివానుబహద్దూరులు, సర్‌లు, కె. సి. ఐయిలు అందరు ప్రభుత్వపక్షపాతులేగదా? మరియొక ప్రధానమార్గము దమ యాధిక్యతను బ్రకటించుకొనుచు ప్రతిష్టకై పెనగులాడుట. ఈ పద్ధతి న్యాయస్థానములలో గలదు. ఒకే తప్పుజేసిన హైందవున కొకశిక్ష. దానికే ఐరోపియనుకు నామమాత్రశిక్ష. మరియు విద్యాలయములలో నెల్లపుడు తమతత్వము, నాగరికత, యాధి క్యతబోధించి బాలుర భావదాస్యాపరుల జేయుచున్నారు. ప్రజలకు "మీకు శక్తిలేదు. మేమే రక్షింపవలెను." మేము లేనిచో మిమ్ము పరదేశీయులు మ్రింగివైతురని నిస్పృహాల

జేయుచున్నారు. మొన్న మొన్నటివరకు దీనివలన నిజముగా దామ సామర్థ్యరహితులమని నమ్మియుండిరి. అన్నిటికంటెను ముఖ్యమయినది దేశములో ప్రజల నిజాభిప్రాయమును వెల్లడి జేయనీయక యడచివైచుటయే పత్రికాస్వాతంత్ర్యముగాని, వాక్స్వాతంత్ర్యముగాని యుండనీయరు. ఈమూలమున జాతీయోద్యమము నడుగదొక్కుటకు బ్రయత్నించుచున్నారు. పై పద్ధతులే ఆంగ్లేయులకు సైనికబలముకన్న నెక్కుడు పరిపాలనా విషయములో తోడ్పడుచున్నవని చెప్పకతీరదు.

సామ్రాజ్యపాలనాతత్వమిట్టిది. సామ్రాజ్యములను జయించినరీతులను పరిపాలించుమార్గములను మనము గ్రహించితిమి. మనభావము లెట్లున్నను నేడు ప్రపంచమును పాశ్చాత్యసామ్రాజ్యములు వరించియున్నవి. ఐరోపాయుద్ధానంతరము గూడ యధీనరాజ్యముల దుస్థితిమారలేదు. ఇట్లు ప్రపంచకమంతయు ఐరోపియనుల స్వలాభమునకై స్వేచ్ఛావిరహితమయి యుండవలసినదేనా యని యీచిన్నిపొత్తము చదువుటచే గలుగుసమస్య. స్వరాజ్యము గాంచుటకు మార్గమేమి? యుద్ధమా? లేక వేరొకటా? యనునవి ప్రధానసమస్యలు. యుద్ధమనవసరము. రక్తపాతము హీనకార్యము. స్వరాజ్యసంపాదనకు రక్తపాత విరహితమయిన రాజబాటగలదు. దానినే నిరూపించి యీచిన్నివ్యాసమును ముగింతిము.

ఇకమీద సామ్రాజ్యముల గతియేమి? ఆసియా యాఫ్రి

కాఖండములు హస్తగతముకానిచో యైరోపియనుల జీవనమే కష్టసాధ్యమను విషయమెల్ల నెరింగినదే. కావున వారు స్వాయముగా న్యాయబుద్ధితో నిచ్చట పరిపాలనను వీడుట కిచ్చగింపరు. పరిష్యాలో మల్లీలు ఆంగ్ల-పరిష్యాసంధిని వినుటకైన యొప్పుటలేదు. చైనాలో జాతీయవికాసత హెచ్చుచున్నది. ఈజిప్టులో జగులుడు జాతీయభావమును పరిస్ఫుటముజేసెను. కెమలుపాషా విజృంభించి తుర్కీకి జయముచేకూర్చెను. భారతదేశములోన సహాయోద్యమము దిగ్విజయముగా నిర్వహింపబడుచున్నది. వీటెనన్నిటిని బరికించి జూచినచో ఆశియాలో పాశ్చాత్యసామ్రాజ్యముల జీవనము రోజులలెక్కలోనికి వచ్చినదని పాణికరుగారు వ్రాసినసంగతి నిశ్చయము.

దైవసహాయముతోబాటు మహోద్యమములకు బురుషలక్షణమే బ్రధానము. స్వారాజ్యసంపాదనకుగూడ బురుషయత్నమవసరము. కాని యీవిషయములలో యుద్ధముగంటె దౌర్జన్యరహితమార్గమే సరియయినదని మానమ్మకము. ఈ సిద్ధాంతమును ప్రపంచకములో మహోత్కృష్ట పురుషుడని వన్నెగాంచిన గాంధిమహాత్ముడే బోధించియున్నాడు. మానవుల రాజ్యములకొరకు బోరాడి రక్తపాతము జేయుటకు సృజియింపబడలేదు. శాంతప్రవృత్తులయి, ద్వేషవిరహితులయి, సత్యమార్గమున జీవితమును బాలింపజేసుకొనుటకే సృజింపబడితిరి. అపకారికి యుపకారము చేయుటుత్కృష్టధర్మము గానేరదు. ద్వేష

ము, ద్వేషము నే ఫలింపజేయుననునది యందరెరింగినదే. కావున మనకు యుద్ధములుగాని, ద్వేషములుగాని యెన్నటికినివలదు. ద్వేషపూరితుడగు హిరణ్యకశిపునిగంటె సత్యాగ్రహియగు ప్రహ్లాదుడే లోకమాన్యుడు. ప్రహ్లాదుడే మహాత్ముని నిర్ణీతమార్గమున కాదర్శపురుషుడు. దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహాద్యమవిజయమును చూడుడు. మహాయుద్ధములోపాల్గొని తన్న వమానించుచో శత్రురక్తమును దనకృపాణికర్పించి అకాలీ శిక్కువీరుడు సైనికులచే దెబ్బలనుదిన్న యవమానమునుసహించి, ధీరత్వముతో గురుకాబాగును వశపర్చుకొన్నవిధము మన కాదర్శము. యుద్ధములో యుద్రేకముతో శత్రుసైనికునకు బలియగుటగంటె యుద్రేకము లేకుండ నైచ్ఛికముగా శత్రుసైనికుని దెబ్బలకు దలయొగ్గుటయే నిజమయిన ధీరత్వము. ఇదియేల మొన్నయుద్ధములో నెన్నడు వినియెరుగనన్ని దౌర్జన్యముల జేసిన జర్మనీ, నేడుఫరాసులు రూరుప్రాంతము నాక్రమించుకొనగా సాత్వికనిరోధము జేయుచున్నది. కార్మికులు బనిచేయుట లేదు. ప్రజలు శిక్షలకు బాల్పడుచున్నారు. కాని జర్మనులు దుపాకిని ప్రేల్చుటలేదు. తుపాకుల కర్మాగారమయిన క్రుప్పుఫ్యాక్టరీ యధికారి కోటీశ్వరుడుగూడ 15 వత్సరముల శిక్షకు బాల్పడెను. ప్రపంచకమంతయు జర్మనీని బొగడుచున్నది. ఫ్రాన్సుయ న్నులో వణకుచున్నది. నేడు నాగపురములోగూడ యుద్యోగులు స్వరాజ్యపతాకమును నిషేధించుచున్నతరిని వందలకొలదియువ

కులు, ఐచ్ఛికముగా శిష్యులకు బాలగుచున్నారుగాని దౌర్జన్యముము జేయుట లేదు.

ఇట్టి మహాతత్త్వము నెరింగియే గాంధిమహాత్ము డసహాయోద్యమమును ప్రారంభించెను. ఆకార్యక్రమమును నిర్వహించుచో స్వరాజ్యము దప్పక జేకూరును. భారతదేశ మీయుద్యమమార్గమున జాత్యైక్యతను, స్వరాజ్యమునుగాంచుచో ప్రపంచకమునకు యుద్ధవిమోచనమును, కళ్యాణమును, శాంతిని యొడగూర్చి ధన్యతగాంచును. దానితో నల్లవారిని తెల్లవారు పెట్టు బాధలంత మొందును. సేచ్ఛాలక్ష్మి తాండవమాడును. సామ్రాజ్యతృష్ణ యంతరించును. ద్వేషవిరహితముగ నీయుద్యమమును నెరవేర్చుచో స్వరాజ్యము త్వరలోవచ్చుటయు, అంతఃకలహములు లేకుండ ననుభవించుటయు, జరగి భారతవర్షమచిరకాలములో ప్రాచ్య నాగరికతతో ప్రాచీనములోవలె "భూలోక స్వర్గమై" విరాజిల్లును.

ఓం శాంతిః శాంతిః శాంతిః